# జీవన్, హాను

# ఎన్నెన్నో విషయాలు తెలుసుకున్నారు



అడవి ఏనుగులు ఎప్పుడూ తింటూనే వుంటాయి. ఒక పెద్ద ఏనుగు రోజుకు 350 కి.గ్రా. దాకా ఆకు అలములు, గొట్ల తింటుంది...మరి ఆ తినే హాంగామాలో అంత ప్రమాణపు రొట్టెని వృథా చేసిపారేసుందిక. తొండంతో ఆకుల్ని, కొమ్మల్ని పీల్చి వెంగాడేస్తుంది తొండంతో–మరి తినే ముందర దుమ్ము;



దులపటంకోసం వంటిపైన వేసి కొడుతుంది. వీటి చర్మం చాలా ముతక. నిజానికి దీని చర్మం బరువే 950 కి.గ్రా. ఉండి 2.5 సె.మీ. మందంగా ఉంటుంది. అయినా పురుగులు కుట్టినా, శీతోష్ణాలకి యివి పసిగట్టి ఆ అనుభవాన్ని తెలుసుకుంటాయి.

ఏనుగు భూమిపైన నివసించే జంతువుల్లోకల్లా పెద్దది. ఆఫ్రికా దేశపు ఏనుగు 3.5 మీటర్ల పొడుగూ, 5,500 కి.గ్రా. బరువూ ఉండవచ్చు. భారత దేశపు ఏనుగు దానికన్నా చిన్నది–భుజాలదాకా 2.7 మీటర్ల పొడుగూ 5000 కి.గ్రా. బరువూ ఉంటుంది.

ఏనుగుకి బాగా ఉపయోగపడే అంగం, దాని తొండం–అది 1.8 మీటర్ల పొడుగూ, 140 కి.గ్రా. బరువుదాకా ఉండచ్చు. మరి దాని తొండం ఎంత బలమైనదంటే, దాంతో 275 కి.గ్రా. దుంగని సహితం సునాయాసంగా ఎత్తెయ్యగలదు. దానికి 40,000 కండరాలున్నాయీ అంటే, అందులో ఆశ్చర్యమేముందన్ని! ఆడ ఏనుగులకి, మొగవాటికి కూడా దంతాలుంటాయి.



ఆఫ్రికన్ జాతి మొగ ఏనుగుకు 3.5 మీటర్ల పొడుగూ, భారత దేశపు వాటికి 1.5 మీటర్ల పొడుగూ దంతాలుంటాయి. ఏనుగు పిల్ల పుట్టినప్పుడు, తల్లి, యితర ఏనుగులూ కలిసి తడతడిగావున్న అప్పుడే పుట్టిన పిల్లని పొడిగా వుంచటం కోసం మట్టిని దానిపైన మట్టిని పోస్తాయి. నిజానికి ఏనుగులకి మట్టిలో దొర్లడం, బురదలో స్నానం చెయ్యడం ఎంతో యిష్టం– ఆ తర్వాత అవి ఇనకతో ఆరబెట్టుకుంటాయి. తద్వారా వాటి చర్మం నున్నగావుంటుంది, పురుగులు చేరవు.

అనుకూల పరిస్థితుల్లో ఏనుగు 120 ఏళ్ళదాకా బతుకుతుంది. వాటి బాల్యమూ ఎక్కువ కాలము దాకా ఉంటుంది, అంటే అవి పెద్దవయ్యేసరికి 25 ఏళ్ళ వయస్సు వస్తుంది.

మామూలు పరిస్థితుల్లో, ఏనుగు నెమ్మదిగా నడుస్తుంది... గంటకి 10 కి.మీ. చొప్పున. అది గనక భయపడితే, అంతకన్న 4 రెట్లు ఎక్కువ వేగంతో పరుగెత్తగలదు.



జీవిత భీమా అనేది మీ కుటుంబాన్ని సురక్షితంగా ఉంచుకోడానికి అతి భద్రమైన మార్గం. దాన్ని గురించి తెల్సుకోండి.



## లైఫ్ ఇన్స్యూరెన్స్ కార్పోరేషన్ ఆఫ్ ఇండియా

daCunha/LIC/131/82 TL



# చందమామ

నవంబర్ 1982



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 1-75

సంవత్సర చందా: 21-00

జెమ్స్‌తో పొదిగాగా నా నావ
పయనిస్తా దాన్లో అద్భుత లోకంలో
తెస్తానిక మరెన్నెన్నో జెమ్స్
నీకోసం నాకోసం మనకోసం



చేజిక్కించుకోండి ఆ మధుర క్షణాల్ని
చేజిక్కించుకోండి ఆ జెమ్స్‌ని !

క్యాడ్‌బరిస్
చాక్లెట్లు

పువ్వులన్నీ సుగంధాన్ని పంచుతాయి, క్యాడ్‌బరిస్ జెమ్స్ తియ్యదనాల్ని అందిస్తాయి.

OBM/8341

నవంబర్ సంచిక

# విజయచిత్ర



**అంజలీదేవి** పరిశ్రమనుంచి 'రిటైర్' ఐనట్లేనా? ఇటీవల ఐదుమాసాల పాటు అమెరికాలో వుండివచ్చిన ఆమె అనుభవాలు .....

**'నాకు ఆదర్శనీయమైన చిత్రం'** విశేషానుభవంగల ప్రసిద్ధ దర్శకుడు **కమలాకర కామేశ్వరరావు** కు ఆదర్శనీయమైన చిత్రం ఏది?

సుప్రసిద్ధ నాయికా పాత్రధారిణి **శ్రీదేవి** ఇల్లు ఎలావుంటుంది? ఆమె 'వార్డ్‌రోబ్' ఎలాఉంటుంది? డ్రాయింగ్ రూమ్ ఎలా వుంటుంది? ఇంట్లోనే మేకప్ చేసుకునేగది ఎలావుంటుంది? – ఈ వివరాలతో –

## శ్రీదేవి ముఖచిత్రం



**నమ్మకాలు....** కొందరు తారలు పాల్గొనే శీర్షిక

పాఠకుల ప్రశ్నలకు "పాటల" జానకి జవాబులు

ఇంకా ఎన్నో! మరెన్నో! * వెల: రెండున్నర

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళ కథ ["ఉత్తమసేనాని!"]కి ఆధారం, రాంబాబు రచన. సాధారణంగా విద్య, పాండిత్యాలనేవి మనిషిలో వినయాన్నీ, విజ్ఞతనూ పెంపొందించేవిగా వుండాలి. అలా కాక, అవి అహంకారానికి దారి తీసినప్పుడు, ఎంతటి పండితుడూ, పామరుడి చేతిలో భంగపడతాడు. ఇందుకు, "విదూషకుడి ప్రశ్నలు" అన్న కథ చక్కని ఉదాహరణ.

## అమరవాణి

శరది న వర్షతి గర్జతి, వర్షతి వర్షాసు నిస్వనో మేఘః,
నీచో వదతి న కురుతే, న వదతి సుజనః కరోత్యేవ.

[శరత్కాలమేఘం ఉరుముతుందితప్ప, వర్షించదు. వర్షఋతు మేఘం ఉరమకుండానే వర్షిస్తుంది. అల్పుడు చెప్పి ఊరుకుంటాడు; ఉత్తముడు చెప్పకుండానే మంచిపని చేస్తాడు.]

సంపుటి 71 నవంబర్ '82 సంచిక 5

విడి ప్రతి : 1–75 : : సంవత్సర చందా : 21-00






బంగారయ్య పెద్ద వడ్డీవ్యాపారి. అతడి ఇంట్లో బోలెడు డబ్బూ, నగలూ వున్నా యని అంతా చెప్పుకుంటారు. ఇది విన్న ఒక దొంగకు అతడి ఇంటికి కన్నం వేయా లని మనసు పుట్టింది. తన పని సులభం చేసుకునేందుకు దొంగ, సాధువు వేషంలో బంగారయ్య ఇంటికి వెళ్ళాడు.

బంగారయ్యకు సాధువులన్నా, సన్యాసు లన్నా ఎంతో గౌరవమూ, నమ్మకమూ. ఆయన దొంగ సాధువుకు గౌరవ సత్కా రాలు ఘనంగా చేశాడు.

దొంగ తన పెట్టుడు గడ్డాన్ని సవరించు కుంటూ, "నీ సత్కారానికి మెచ్చాను. ప్రతిఫలంగా, నీ కొక ఉపకారం చేయ దలిచాను. అతి త్వరలో నీ ఇంట దొంగతనం జరగనున్నది. నీ డబ్బును రక్షించుకోవాలనివుంటే, దాన్ని భద్రంగా ఏ పెట్టెలోనైనా వుంచి, నీ పెరట్లోని పాడుపడ్డనూతిలో పారవెయ్యి. ఒక మాసం ఆగి, డబ్బు తిరిగి తెచ్చుకో," అన్నాడు.

బంగారయ్య సరేనన్నట్టు తల వూపి, సాధువు వెళ్ళాక, భార్యతో యీ విషయం చర్చించాడు. సాధువు చెప్పినట్టే చెయ్యమని ఆమె సలహా యిచ్చింది.

అయితే, బంగారయ్య ఇంట్లో, ఎవరికీ తెలియని రహస్య ప్రదేశం ఒకటి గోడలో వున్నది. అందువల్ల డబ్బు పోతుందన్న బెంగ అతడికి లేదు. బంగారయ్య డబ్బును అక్కడ దాచి, ఒక ఖాళీ పెట్టెను నూతిలో పారవేసి, అందులో డబ్బు పెట్టానని భార్యకు అబద్ధం చెప్పాడు.

బంగారయ్య భార్య నోట ఏ రహస్యమూ దాగదు. అతడు డబ్బును నూతిలో దాచుకున్నాడన్న సంగతి మర్నాటికే ఊరంతా పాకింది.

"వసుంధర"

ఆ మరసటి రోజు రాత్రి దొంగ గోడ దూకి వచ్చి, బంగారయ్య పెరట్లో నూతి దగ్గిరకు వెళ్ళేసరికి, అక్కడ ముగ్గురు మనుషులు ఘర్షణపడుతున్నారు.



వాళ్ళు ముగ్గురూ దొంగలే! బంగారయ్య తన డబ్బును నూతిలో పడవేశాడని విని, ఒకరికి తెలియకుండా ఒకరు వచ్చి, అక్కడ కలుసుకుని ఘర్షణపడుతున్నారు.

"అసలు బంగారయ్యకు డబ్బు నూతిలో పారవేయమని సలహా యిచ్చింది, నేను!" అన్నాడు అప్పుడే వచ్చిన నాలుగో దొంగ.

అతడు మిగతా ముగ్గురికీ పోట్లాడుకోవడంవల్ల నష్టపోతామని చెప్పి, నలుగురం కలిసి ఏదో ఒక ఒప్పందానికి వద్దామన్నాడు.

"బాగా వున్నవాడు కనక, బంగారయ్య నూతిలో చాలా డబ్బు పడవేసివుంటాడు. దాన్ని మనం సమంగా పంచుకుంటే సరిపోతుంది," అన్నాడు అందరిలోకీ పెద్ద దొంగ.

ఇందుకు అందరూ సరేనంటే సరే అన్నారు. దొంగలందరూ వచ్చేటప్పుడు వెంట తాళ్ళు తెచ్చుకున్నారు. ఆ తాళ్ళల్లో ఒకటి నూతి పక్కనే వున్న చెట్టుకు కట్టి, రెండవ కొసను నూతిలోకి జారవిడిచారు. ఆ తాడు పట్టుకుని ఒక దొంగ నూతిలోకి దిగాడు.

నుయ్యి చాలా లోతుగా వున్నది. అక్కడ నీళ్ళపైన ఒక పెట్టె దొంగ కంట బడింది. వాడు తాడు కొసను దానికి బిగించి, మిగతా తాడు పట్టుకుని నూతి పైకి వచ్చాడు. నలుగురు దొంగలూ తాడు పట్టుకుని, పెట్టెను బయిటికి లాగారు.

పెట్టె మూతకు తాళంవేసి వున్నది. వాళ్ళల్లో ఒక దొంగ ఎలాంటి తాళాన్నయిగా అవలీలగా తెరవగల నేర్పరి. వాడు క్షణాల మీద తాళాన్ని వూడదీశాడు. అందరూ కలిసి ఉత్సాహంగా పెట్టె మూత తెరిచారు. ఆ వెంటనే లోపలి



నుంచి ఒక భూతం నవ్వుతూ బయిటికి వచ్చింది.

భూతాన్ని చూస్తూనే నలుగురు దొంగలకూ గుండెలు అవిసిపోయాయి.

"భయపడకండర్రా, తమ్ముళ్ళూ!" అన్నది భూతం.

భయం వేసినా, వేయకపోయినా దొంగలకు పారిపోయేందుకు కాళ్ళల్లో శక్తి లేదు. భూతం చాలా తాపీగా, "నిన్న యీ పాడుబడ్డ నూతిలో పెట్టె ఒకటి పడింది. బాగుంది కదా అని, అందులో దూరి పడుకున్నాను. అదీ మంచిదే అయింది! మీ ధర్మమా అని బయట పడ్డాను. మీరు, నాకు మంచి ఉపకారం చేశారు; ప్రత్యుపకారం చేస్తాను, కోరుకోండి!" అన్నది, దొంగల కేసి అప్యాయంగా చూస్తూ.

ఆ మాటలతో దొంగల్లో ఒకడికి ధైర్యం వచ్చింది. వాడు, భూతాన్ని, "అసలు ఎవరు నువ్వు? ఈ నూతిలో ఎందుకుంటున్నావు? ఇంత కాలంగా ఎందుకు బయట పడలేకపోయావు?" అని అడిగాడు.

అలా ప్రశ్నించిన దొంగ కేసి భూతం నవ్వుతూ చూసి, "అదంతా పెద్ద కథ. నాలుగు మాటల్లో చెపుతాను. బంగారయ్య తాత రోజుల్లో, మేము అతడి పొరుగింటి వాళ్ళం. మా తాత, యీ నూతిలో నిధి దాచాడని పుకారుండేది. ఒక రోజున ఎవరూ చూడకుండా, యీ నూతిలోకి దూకాను. నూతిలో అట్టడుగున నిధి ఒకటి వున్నది. ఒక పెట్టెనిండా వజ్రాలూ, వైడూర్యాలూ వున్నవి. అయితే, అవి తీసుకుని బయిటికి వచ్చేదెలా? నేను అక్కడే చచ్చిపోయి, భూతాన్నయాను. ఎంత ప్రయత్నించినా పదడుగుల ఎత్తు కంటే ఎగరలేకపోవడంతో, ఎన్నో ఏళ్ళనుంచి యీ నూతిలోనే వుండిపోయాను. ఇన్నాళ్ళకు మీరు, నన్ను బయిటికి తీశారు! అందుకే మీకు ప్రత్యుపకారం చెయ్యాలనుకుంటున్నాను. ఇదీ, నా కథ!" అన్నది.



"నువ్వు, మాకు ఏ విధంగా సాయ పడగలవు?" అని అడిగాడొక దొంగ.

"మీకు ఎక్కడినుంచి, ఏంకావాలన్నా, తెచ్చి యివ్వగలను," అన్నది భూతం.

"అయితే, నూతిలోంచి డబ్బు తేగలవా?" అన్నాడొక దొంగ.

"మీరు నూతిలోకి దిగి, నిధి వున్న పెట్టెను తాడుకు కట్టండి. ఎంత బరువైనా సరే నేను పైకి లాగగలను," అన్నది భూతం.

ఆ నిధి మాట నిజమో కాదో తెలుసుకుందామని ఒక దొంగ నూతిలోకి దిగి, నీళ్ళల్లో మునిగి వెతికాడు. వాడికి ఒక పెద్ద పెట్టె దొరికింది. దాన్ని నీటిపైకి కొద్దిగా ఎత్తి చూస్తే, నిండుగా ధగధగ మెరుస్తూ వజ్రాలూ, వైడూర్యాలూ కనిపించినై. వాడికి పెట్టెను సాంతం పైకి లాగడం సాధ్యపడలేదు.

దొంగ తాడు సాయంతో బయిటికి వచ్చి, తాను చూసింది మిగిలిన ముగ్గురు దొంగలకూ చెప్పాడు. భూతం ఎంత బరువైనా పైకి లాగగలనంటున్నది గనక, నలుగురం నూతిలో దిగి, నిధి వున్న పెట్టెను సాంతం బయిటికి లాగి, తాడుకు కడదామనుకున్నారు వాళ్ళు.

నలుగురు దొంగలూ నూతిలోకి దిగబోతుండగా భూతం, వాళ్ళతో, "ఒక్క వజ్రం అమ్మగా వచ్చిన డబ్బుతో, మీ నలుగురూ హాయిగా బతకవచ్చు. అలాంటప్పుడు ఆ పెట్టెలో వున్న నిధి అంతా ఏం చేసుకుంటారు?" అన్నది.

"డబ్బు రుచి నీకేం తెలుసు? దాన్ని అలా చూస్తూ యుగాలను, క్షణాలుగా గడిపెయ్యవచ్చు," అన్నారు దొంగలు.

వాళ్ళు నలుగురూ నూతిలోకి దిగగానే, భూతం తాళ్ళను ముక్కలు, ముక్కలుగా తెంపి అవతల పారేసి, "మీరు దురాశ కొద్దీ నా మాట లక్ష్యపెట్టారు కాదు. నా దారిన నేను పోతున్నాను. మీ అవస్థ లేవో మీరు పడండి!" అంటూ చెరువు గట్టున వున్న తాటితోపు కేసి వెళ్ళింది.

జరిగింది చూసి దొంగలు నలుగురూ బెంబేలు పడిపోయారు. నూతిలో అంత పెద్ద నిధి తమకు దొరికినా, దాన్ని తీసుకుని పైకి వచ్చే మార్గం వాళ్ళకు కనిపించలేదు.

"మనం భూతం యిచ్చిన మంచి సలహా వినక చిక్కుల్లో పడ్డాం. ఎవరన్నా వచ్చి మనకు సాయపడితే తప్ప, లేకపోతే యిక్కడే చచ్చి, మనం కూడా భూతాలం అయిపోతాం," అన్నాడు వాళ్ళల్లో అందరికన్నా పెద్ద దొంగ.

ఆ వెంటనే, బంగారయ్యకు డబ్బు పాడుబడ్డ నూతిలో పారవెయ్యమని చెప్పిన దొంగ పెద్దగా గొంతెత్తి, "రక్షించండి! రక్షించండి!" అంటూ కేకలు పెట్టాడు.

ఆ కేకలు విన్న బంగారయ్యతోపాటు, ఇరుగు పొరుగువాళ్ళు కూడా నూతి దగ్గిరకు వచ్చి, లోపల వున్న దొంగలను చూసి, "ఒరే, పాడుబడ్డ నూతిలో మీరెందుకు దిగారు? ముందు నిజం చెప్పండి, లేకపోతే మిమ్మల్ని బయిటికి లాగం," అన్నారు.

మరుక్షణం దొంగలు, "అయ్యా, యిక్కడ పెద్ద నిధి వున్న పెట్టె వున్నది. నూతిలోకి తాళ్ళు జార్చారంటే, దాన్ని తీసుకుని పైకి వస్తాం," అన్నారు.

నిధి మాట వింటూనే, అక్కడ చేరిన వాళ్ళలో ఒకడు పోయి గ్రామ పెద్దను తీసుకువచ్చాడు. ఆయన చెప్పగా నూతిలోకి తాళ్ళు వేసి దొంగలను పైకి లాగారు. వాళ్ళు వెంట తెచ్చిన పెట్టెలో వున్న నిధిని చూసి అందరూ ఆశ్చర్యపోయారు.

బంగారయ్య ఆశగా దానికేసి చూస్తూ, ఏదో చెప్పబోయేంతలో గ్రామ పెద్ద, "ఈ నిధి గ్రామం ఉమ్మడి సొత్తు. దీన్ని గ్రామం మంచికి ఉపయోగిస్తాం. దొంగలకు ఎలాంటి శిక్ష వేయాలో తరవాత ఆలోచిద్దాం. నిధి వున్న పెట్టెనూ, వాళ్ళనూ గ్రామ కచేరీ దగ్గిరకు తీసుకు రండి," అని అక్కడి నుంచి బయలు దేరాడు.






## 13

[నరవాహనుడి సైన్యానికి, కోయలకూ జరిగిన యుద్ధంలో, నరవాహన సైనికులు కోయ భటులను హతమార్చి, శిథిలదుర్గాన్ని ఆక్రమించుకున్నారు. శివదత్తుడు తన అనుచరులతో సముద్రం మీద బయలుదేరాడు. వారికి దారిలో మందరదేవుడు కనిపించాడు. కొంత సేపటికి దూరాన వెలుగు కంటబడింది. పడవలను ఆటుకేసి నడపసాగారు. తరవాత—]

కన్ను పొడుచుకున్నా కానరాని ఆ కారు చీకటిలో శివదత్తుడూ, మందరదేవుడూ వున్న పడవలు రెండూ క్రమంగా వెలుగు కనబడుతూన్న వైపుకు కదలసాగినై. రెండు, మూడు రోజులుగా నిద్రాహారాలు లేని వాళ్ళ అనుచరులు ఆరుగురూ, పడవలను మందంగా నడపసాగారు.

"శివదత్తా, నన్ను, ఆకలి దహించి వేస్తున్నది," అంటూ మందరదేవుడు శివదత్తుడికేసి చూసి, "మన అనుచరులూ అదే స్థితిలో వున్నారు. ఆ వెలుగు కనబడే ప్రాంతం ఏదో ఒక ద్వీపమై వుంటుందనేందుకు సందేహం లేదు. పోతే అది మానవవాసయోగ్యమవునా కాదా అన్నదే సమస్య!" అన్నాడు.

"నేనూ, అదే ఆలోచిస్తున్నాను," అంటూ శివదత్తుడు నవ్వాడు. "ఎక్కడో




"శివదత్తా, మీరు చెప్పదలచిన విషయమేదో నేను గ్రహించాను. ఎంత భయంకర ద్వీపంలో అయినా అడుగిడేందుకు నేను భయపడను. అంతేకాదు, నా బొందెలో ప్రాణం వుండగా నరవాహనుడు నాకు చేసిన ద్రోహాన్ని మరచిపోను. తిరిగి, నా రాజ్యాన్ని జయించుకునేందుకు శాయశక్తులా ప్రయత్నిస్తాను," అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడికి, మందరదేవుడి మాటలు చాలా సంతోషాన్ని కలిగించినై. నరవాహనుడు చేసిన ద్రోహాన్ని అతడు మరిచిపోలేదని శివదత్తుడు గ్రహించాడు.

ఒకచోట ఏదో విధంగా పొట్టనింపుకుంటూ కాలక్షేపం చెయ్యటమే మన జీవితాశయం కాదనుకుంటాను. మీరు పదచ్యుతులైన మరాళద్వీప ప్రభువులు! నేను మహాసేనాని సమరసేనుడి అనుచరుణ్ణి! ఇద్దరమూ క్రూరాతిక్రూరుడైన ఒకే వ్యక్తి కారణంగా, ఈ గాఢాంధకారంలో, కానని సముద్ర ప్రాంతాల తిరుగుతున్నాం!"

శివదత్తుడి మాటలకు మందరదేవుడు జవాబివ్వలేదు. అతడి మనసులో ఒక్కసారిగా మరాళద్వీపం, అక్కడి ప్రజలు, తను రాజ్యాన్ని కోల్పోయిన సంఘటనలూ అన్నీ మెరుపులా కదిలినై.

అతడు ఏమో చెప్పబోయేటంతలో, పడవలు నడుపుతున్న భటులు ఒక్కసారిగా కేకలు పెట్టారు.

"ఈ ప్రాంతమంతా కొండరాళ్ళమయం! మనం ఏదో ద్వీపాన్ని సమీపించాం. ఈ చీకటిలో ఈ కొండరాళ్ళను తప్పించుకుని పడవలు నడపడం సాధ్యం కాదు!" అన్నారు వాళ్ళు.

శివదత్తుడు పడవలను వున్న చోటనే ఆపవలసిందిగా ఆజ్ఞాపించాడు. జాగ్రత్తగా ముందుకు చూసినప్పుడు అతడికి సముద్రతీరం వెంట గుబురుగా పెరిగిన చెట్ల గుంపులు చూచాయగా కనిపించినై. తాము ఒకానొక ద్వీపప్రాంతాన్ని చేరారు.

అందులో సందేహంలేదు. కాని, ఆ చీకటిలో పడవలు తీరాన్ని చేరే మార్గం మటుకులేదు.

ఆ ప్రాంతమంతా, సముద్ర జలంలో నుంచి నిక్కచూస్తున్న కొండ శిఖరాల మయం. అలల తాకిడికి పడవలు వాటిలో ఏ ఒక్కదానికి కొట్టుకున్నా, అది ముక్కలు చెక్కలు కాకమానదు!

''మందరదేవా, మన సముద్రయానం ముగిసింది!'' అన్నాడు శివదత్తుడు. ''ఎదురుగా తీరాన్ని ఒరుసుకుంటూ, గాలికి తలలూపే చెట్ల వరస మీకు కనబడుతున్నదనుకుంటాను. ఈ చీకట్లో ఈ రాళ్ళ మధ్యనుంచి ఏ ప్రమాదం కలక్కుండా పడవలను తీరానికి చేర్చటం సాధ్యమయ్యే పని కాదు!''

''సూర్యోదయం వరకూ యిక్కడే వేచి వుందామని మీరు అభిప్రాయపడుతున్నారా?'' అని మందరదేవుడు ఆశ్చర్యంగా ప్రశ్నించాడు.

శివదత్తుడు తల పంకించి, ''ఆ పద్ధతి మంచిది కాదనుకుంటాను,'' అన్నాడు. ''ఒకవేళ యీ ద్వీపం ఏ అనాగరిక మానవులకో నిలయమై వున్నట్లయితే, వాళ్ళు మనను పట్టపగటి వెలుగులో యిట్టే పసిగట్టి వేటాడగలరు. కనుక, మనం చీకటి వుండగానే తీరం చేరి



అక్కడి పరిస్థితులెలా వున్నవో తెలుసుకోవటం మంచిది. ఒకవేళ ఎవరైనా మనను ఎదిరించేట్టయితే, చీకట్లో ప్రమాదాన్నుంచి పారిపోవటం తేలిక,'' అన్నాడు.

శివదత్తుడి అభిప్రాయంతో మందరదేవుడు ఏకీభవించాడు. పడవలు రెండూ అక్కడ నీటిలో మునిగివున్న కొండశిఖరాలకు కట్టబడినై. ఇక తీరం చేరాలంటే దాదాపు ఒక కూతవేటు దూరం నిలువు లోతు నీటిలో యీదుకుపోవాలి: తీరాన అలలు ఉవ్వెత్తున లేస్తూన్నందువల్ల ప్రమాదం లేకుండా ఒడ్డుకు చేరటం కష్టసాధ్యమని అందరూ గ్రహించారు.

కొంచెంసేపు సంప్రతింపుల తరవాత అందరూ నడుములు బిగించి నీటిలోకి ఉరికారు. పెద్ద అలలు వారిని రాళ్ళ మీదకు విసరసాగినై. ఎంతో నేర్పుగా వాటిని తప్పుకుంటూ చివరకు ఎలా అయితేం అందరూ ఒడ్డుచేరారు. తడిసిన గుడ్డలను పక్కన పడవేసి, మూటలుకట్టి తెచ్చుకున్న పొడిగుడ్డలను ధరించారు. అయినా అందరూ చలికి గడగడ వణికి పోతున్నారు.

"ఈ చలి బాధకు తట్టుకోవాలంటే మంట వేయటం తప్ప మార్గం లేదు. ఎండు పుల్లలు పోగు చేసుకురమ్మంటారా?" అని ఒక సైనికుడు శివదత్తుణ్ణి అడిగాడు.

"సరే కానివ్వండి. ఈ ద్వీపం ఏ నర మాంసభక్షకులకో ఆలవాలమైతే, మనలను ఆ మంటలోనే వాళ్ళు హాయిగా కాల్చుకు తినగలరు," అంటూ శివదత్తుడు నవ్వాడు.

"మన చేతనున్న పదునైన కత్తులూ, విల్లంబులూ.." అంటూ మందరదేవుడు ఏమో చెప్పబోయేంతలో శివదత్తుడు అతడి మాటలకు అడ్డు వచ్చి, "మందర దేవా, మీకు ఇలాంటి ద్వీపాల సంగతీ, అందులో నివసించే ఆటవికుల సంగతీ తెలీదు. ఈ ఆటవికులు భయమంటే ఏమిటో తెలియని అమాయకులు. మీ కత్తితో ఒకణ్ణి నరికేంతలో, ఆ వెనుక నుంచి ఒక్కసారిగా ఆరుగురు మీ మీదకు లంఘిస్తారు!" అన్నాడు.



ఇంతలో సైనికులు ఎండుపుల్లలు పోగు చేసి నిప్పు వెలిగించారు. అందరూ ఆ మంట చుట్టూ చేరి చలి కాచుకుంటున్నారు. శివదత్తుడు తను ఎలాంటి ద్వీపం చేరాడో, ముందు ముందు ఎలాంటి ప్రమాదాలను ఎదుర్కొవలసి వుంటుందో అని ఆలోచించసాగాడు.

మందరదేవుడికి మాత్రం అలాంటి ఆలోచనలేమీ లేవు. సూర్యోదయం అయితే, ఆ వెలుగులో ఈ ద్వీపాన్ని గురించి సర్వం అవగాహన చేసుకోవచ్చునని అతడి తలంపు.

ఉన్నట్టుండి హఠాత్తుగా కుక్క మొరిగిన సవ్వడి వినబడింది. శివదత్తుడితో పాటు అందరూ ఒక్కసారిగా ఉలిక్కిపడి, ఆ సవ్వడి వచ్చిన వైపుకు తలలు తిప్పారు.

మందరదేవుడు కూడా కొద్ది సేపు అటుకేసి పరీక్షగా చూసి, తరవాత శివదత్తుడినుద్దేశించి యిలా అన్నాడు:

''శివదత్తా, మనం భయపడినట్టు ఇది అనాగరిక జాతులు నివసించే భయంకర ద్వీపం కాదనుకుంటాను. కుక్కను మచ్చిక చేసి వుపయోగించుకోవటం ఒక్క నాగరిక మానవులకే తెలుసు!''

''మందరదేవా, మీరు చాలా పొరబడ్డారు,'' అంటూ శివదత్తుడు నవ్వాడు. ''నా కళ్ళతో నేను చిరుత పులులను మచ్చికచేసి వేటకు ఉపయోగించే ఆటవికులను ఎందరినో చూశాను. ఆ సంగతి



మీకు లోగడ చెప్పాననుకుంటాను. పోతే, యిప్పుడు మనం విన్న కుక్క అరుపు, ఏఅడవి కుక్కదయినా కావచ్చు. సూర్యోదయం అవగానే....''



శివదత్తుడు మాటముగించక ముందే, చెట్లకొమ్మలను రివ్వున రాచుకుంటూ ఒక పెద్దరాయి శరవేగంగా వచ్చి మంట ముందు చలికాచుకుంటున్న ఒక సైనికుడి వీపుకు తాకింది. సైనికుడు ఆ దెబ్బకు ఒక చావుకేక పెట్టి ముందుకు పడిపోయాడు. వెంటనే మందరదేవుడు బాణం ఎక్కుపెట్టి ఆ రాయి వచ్చిన వైపుకు వదిలాడు.

మరుక్షణం శివదత్తుడుకి కూడా భయం కలిగించే లాంటి వికృత మానవకంఠం బాధతో అరిచిన ధ్వని వినబడింది. అందరూ ఒకరి మొహాలు ఒకరు చూసుకుని నివ్వెర పోయారు. ఈ ద్వీపం ఒట్టి నిర్జన ప్రదేశం కాదు. ఏవో భయంకరమైన క్రూర మానవ జాతులు కొన్ని యిక్కడ నివసిస్తున్నవి. అందుకు సాక్ష్యం, తొలిసారిగా వినబడిన ఆ వికృత మానవ కంఠం!

మందరదేవుడు కత్తిదూసి ముందుకు నడుస్తూ, సైనికులను తనను అనుసరించ మన్నాడు. కాని అంతలో శివదత్తుడు అతణ్ణి వారిస్తూ, ''మందరదేవా, మీరు చేయబోతున్న పని చాలా ప్రమాదకరమైనది. మనం కొత్తవాళ్ళం. ఈ చీకటిలో ఏ చెట్టున, ఏ పొదమాటున ఎలాంటి ప్రమాదం పొంచి వుంటుందో మనకు తెలియదు,'' అన్నాడు.

''ఆ రాయి విసిరిన వాడెవడైనా, అతణ్ణి నా బాణంతో గాయపరిచాను. అంబు తాకీతాకటంతోనే వాడు వికృతంగా అరిచాడు. బహుశ వాడు యింకా బ్రతికి వుంటే, వాణ్ణించి మనం యీ ద్వీపంలోని మంచి చెడ్డలు తెలుసుకోవచ్చు,'' అన్నాడు మందరదేవుడు.

శివదత్తుడు, మందరదేవుడి అభిప్రాయంతో ఏకీభవించలేదు. ''ఇప్పటి

స్థితిలో మీ బాణం దెబ్బకు గురైనవాడు మరణించాడో లేక గాయపడి పారిపోయాడో మనకు తెలియదు. వాడు ఒంటరిగాడా లేక మరి కొందరితో కలిసి వున్నాడా అన్నది కూడా మనం వూహించలేం. కనుక, సూర్యోదయం వరకూ తగు జాగ్రత్తలో, వున్న చోటు నుంచి కదలకపోవటం అన్నివిధాలా మంచిది,'' అన్నాడు శివదత్తుడు.

శివదత్తుడి మాటలకు అంగీకార సూచకంగా అందరూ తలలు వూపారు. ఆ తరవాత నిద్రమత్తుతో జోగుతున్నవారు వెంటనే నిద్రకు వుపక్రమించగా, శివదత్తుడూ, మరొక సైనికుడూ కావలి కూర్చున్నారు.

తూర్పున ఎర్రని రక్తకాంతులతో అరుణోదయం అయేవరకూ, ఆ ప్రాంతాల చెప్పదగిన మరే దుర్ఘటనా జరగలేదు.

బాగా తెల్లవారగానే మందరదేవుడూ, సైనికులూ కళ్ళుతెరిచారు. తాము వున్న ప్రాంతమంతా ఒకానొక కీకారణ్యమని వాళ్ళకు తెలిసిపోయింది. ఆకాశంలోకి చొచ్చుకుపోయిన పెద్ద మానులూ వాటి మొదళ్ళను కప్పివేస్తూ పెరిగిన అనేక చిన్నా పెద్దా చెట్లూ, పొదలూ; విచ్చలవిడిగా అల్లుకుపోయిన తీగలూ, వాటి మీద గెంతుతూ పరుగెత్తే కోతులూ, అరుస్తూ ఎగురుతున్న వివిధ రకాల పక్షులూ—అంతా భయోత్పాహాలను కలిగిస్తున్నది.

''మందరదేవా, ఇక మనం రాత్రి వదలి పెట్టిన పనికి ఉపక్రమించవచ్చు-మీ బాణం ఎటుగాపోయి, సుమారు ఎంత దూరంలో ఆ వికృతకంతుణ్ణి తాకిందో, మీరు చెప్పగలరనుకుంటాను?'' అన్నాడు శివదత్తుడు.

మందరదేవుడు ముందు దారి తీశాడు. చెట్ల తీగలనూ, పొదలనూ తప్పించుకుంటూ అందరూ వంద గజాలదూరం వెళ్ళేసరికి, అక్కడ పచ్చని ఆకులపై కొన్ని నెత్తురు మరకలు కనిపించినై.

—(ఇంకా వుంది)






# ఉత్తమసేనాని

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవ సాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నీ పట్టుదలా, కార్యసాధనపట్ల అచంచలమైన దీక్షా చూస్తూంటే, నువ్వే పాటి జ్ఞానవంతుడివో తెలుసుకోవాలన్న కుతూహలం కలుగుతున్నది. ఎవరైనా పెద్ద రాజు కోసంగానీ లేక గొప్ప చక్రవర్తి ఆజ్ఞ మేరకుగానీ నువ్వీ శ్రమలు పడుతూంటే, కార్యం సానుకూలమయ్యాక, వాళ్ళు నీ శక్తి సామర్థ్యాలను ఎలా అంచనా కడతారో చెప్పడం కష్టం. ఇలాంటి విషయాల్లో ముందే తగు జాగ్రత్తలో వుండేందుకు హెచ్చరికగా, నీకు వీరకేతుడూ, అమరసేనుడూ అనే క్షత్రియయువకుల కథ చెబుతాను, శ్రమ

## బేతాళ కథలు

తెలియకుండా విను," అంటూ యిలా చెప్పసాగాడు

పుష్పక దేశాన్ని గరుడవర్ధను డనే రాజు పాలించేవాడు. ఆయన తండ్రి కాలం నుంచీ సైనిక శాఖకూ, వేగుల శాఖకూ అధిపతులుగా వున్న ప్రచండ సేనుడూ, బలవంతవర్మా వృద్ధులైపోవడంతో, రాజు మరెవరైనా సమర్థులైన వారిని, ఆ స్థానాలకు నియమించాలనుకున్నాడు.

రాజు విచారించగా, కొలువులో వీరకేతుడు, అమరసేనుడు అనే యువకులు అత్యంత శక్తిసామర్థ్యాలు కలవాళ్ళనీ, విశ్వాసపాత్రులనీ తెలిసింది. గరుడవర్ధనుడు వాళ్ళల్లో ఎవరిని, ఏ పదవికి నియమించడం బావుంటుందన్న విషయం మంత్రి ముకుందవర్మతో చర్చించాడు.

"మహారాజా, వీరకేతుణ్ణీ, అమరసేనుణ్ణీ ఒక ఆరు నెలల పాటు రెండు పదవుల్లోనూ నియమించి చూద్దాం. వీరకేతుడు సేనాధిపతిగా వున్న కాలంలో, అమరసేనుడు వేగుల శాఖాధిపతిగా వుంటాడు. ఆరు నెలలు గడవగానే, అమరసేనుణ్ణి సేనాధిపతిగానూ, వీరకేతుణ్ణి వేగుల శాఖాధిపతిగానూ మార్చుదాం. తమ పదవీ కాలంలో వాళ్ళు కనబరిచే సామర్థ్యాన్ని బట్టి, తరవాత వారిని ఆయా పదవుల్లో స్థిరపరుద్దాం," అన్నాడు మంత్రి.

గరుడవర్ధనుడికి యీ సలహా నచ్చింది. ఆయన వీరకేతుణ్ణి పిలిపించి, ఆరు



నెలలపాటు సేనాధిపతి పదవి నిర్వహించమన్నాడు. అలాగే అమరసేనుణ్ణి ఆరు నెలల కాలం వేగుల శాఖాధిపతిగా బాధ్యత స్వీకరించమన్నాడు.

వీరకేతుడు సేనాధిపతి పదవికి వస్తూనే, అశ్విక దళాలనూ, గజ బలాలనూ వృద్ధిచేయసాగాడు. అంతే కాక, యుద్ధ సమయంలో సైనికులు అవలంబించే కొన్ని పాత వ్యూహాలా, ఎత్తుగడలా స్థానంలో, విదేశీయులు అనుసరించే ఆధునిక యుద్ధపద్ధతులను ప్రవేశపెట్టాడు. అదే సమయంలో గాంధార, కామరూప దేశాల నుంచి మేలు జాతి గుర్రాలనూ, ఏనుగులనూ తెప్పించాడు. కొన్ని సరికొత్త ఆయుధాలను కూడా విదేశాల నుంచి వర్తకుల ద్వారా కొన్నాడు.

ఆరునెలలు గడవగానే సేనాధిపతిగా వీరకేతుడి పదవీకాలం ముగిసింది. రాజు గరుడవర్థనుడు అతణ్ణి వేగుల శాఖాధిపతిగా నియమించి, ఆ పదవి నిర్వహిస్తున్న అమరసేనుడికి, సేనాధిపతి స్థానం అప్పగించాడు.

అమరసేనుడు పదవికి రాగానే, విదేశాల నుంచి మేలు జాతి గుర్రాలనూ, ఏనుగులనూ తెప్పించడం ఆపుచేశాడు. ఆయుధాల విషయంలోనే కాక, సైనిక శిక్షణ మొదలైన వాటిల్లో కూడా తిరిగి పాత పద్ధతులను ప్రవేశ పెట్టాడు. ఏ విషయంలోనైనా విదేశాలను అనుకరించడం





అతి భయంకరంగా జరిగింది. ఎంతో సైన్యనష్టం జరిగినప్పటికీ అమరసేనుడి పరాక్రమం, యుద్ధనైపుణ్యాల కారణంగా, తిరిగి పుష్పకదేశం విజయాన్ని సాధించింది.

ఇది జరిగాక మంత్రి ముకుందవర్మ, రాజును దర్శించబోయి, "మహారాజా, వీరకేతుడు, అమరసేనులకు మనం పెట్టిన ఆరునెలల గడువు సంగతి వదిలి, తమరు వెంటనే వీరకేతుడికి సేనాధిపతి పదవి యివ్వండి. అందుకు, అతడే తగినవాడు!" అన్నాడు.

అంటే, స్వదేశాన్ని కించపరచడమే అని అతడి నమ్మకం. అది, దేశభక్తుడైన వాడెవ్వడూ చేయగూడని పని!

అతడు సేనాధిపతి అయి మూడో మాసం ముగిసే లోపలే, పక్కన వున్న జయపుర రాజ్యం, పుష్పకదేశం మీదికి దండెత్తి వచ్చింది. అమరసేనుడు ఎంతో నేర్పుగా సైన్యాన్ని నడిపి వీరోచితంగా పోరాడి, జయపుర రాజ్యసేనలను తరిమి కొట్టాడు.

అతడి సేనాధిపతి పదవీకాలం మరొక నెల రోజుల్లో ముగుస్తుందనగా, యీసారి పుష్పకదేశం మీదికి, దక్షిణంగా వున్న విదర్భదేశ సైన్యాలు దాడి వచ్చినై. పోరు

"నేనూ అదే ఆలోచిస్తున్నాను. ఇప్పటికి మనపై రెండు శత్రుదేశాల దాడి ముగిసింది. ఈసారి గౌడదేశం రాజు మనపై యుద్ధానికి వచ్చి, అమరసేనుడి చేతిలో ప్రాణాలే కోల్పోవచ్చు. అలా జరగడం మనకేమాత్రం క్షేమం కాదు!" అంటూ చిన్నగా నవ్వాడు రాజు.

తరవాత వారం తిరక్కుండానే, ఒక మంచి ముహూర్తాన రాజు, వీరకేతుణ్ణి సైన్యాధిపతిగానూ, అమరసేనుణ్ణి వేగుల శాఖాధిపతిగానూ నియమించి, ఇద్దరికీ విలువైన బహుమానాలిచ్చి గౌరవించాడు.

బేతాళుడు యీకథ చెప్పి, "రాజా, అమరసేనుడు తన దేశంపైకి దాడికి వచ్చిన రెండు దేశాలను ఓడించి, సేనాధి

పతిగా తన యుద్ధనైపుణ్యాన్ని రుజువు చేసుకున్నాడు గదా? అలాంటప్పుడు రాజు గరుడవర్ధనుడు అతణ్ణి కాదని, వీరకేతుడికి సేనాధిపతి పట్టం కట్టబెట్ట డానికి కారణం అవివేకమా? అసూయా? ఈ సందేహానికి సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో, నీ తల పగులుతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''రాజులో నువ్వుచెప్పే అవలక్షణాలలో ఏ ఒక్కటీ లేకపోగా, అతడు గొప్పవివేకి, రాజనీతిజ్ఞుడూ కూడా. సేనాధిపతి అయిన వాడికి దేశభక్తి, మాతృదేశం పట్ల ఎనలేని గౌరవం వున్నంత మాత్రాన సరిపోదు. అతడు ఎప్పటికప్పుడు పొరుగు దేశాల సైనిక, ఆయుధసంపత్తిపై ఒక కన్నువేసి వుంచాలి. వాళ్ళకన్న తన సైనికుల్ని మరింత సుశిక్షితులుగా తయారు చేయడమేకాక, ఆయుధాల విషయంలో కూడా పైచేయిగా వుండాలి. వీరకేతుడు ఇలాంటి జాగ్రత్తలో వుండడం వల్లనే, పొరుగు దేశాలు అతడు సేనాధిపతిగా వున్న కాలంలో దాడి చేసేందుకు భయపడినై. కాని, అమరసేనుడి సేనాధిపత్యంలో దీనికి భిన్నంగా జరిగింది. అందువల్లనే పుష్పకదేశ బలాన్ని చులకనచేసి, శత్రువులు దండెత్తి వచ్చారు. యుద్ధంలో పెద్ద నష్టాలతో చచ్చీ చెడి విజయం సాధించడంకన్న, అసలు శత్రువులు దండెత్తి వచ్చేందుకే జంకేలా చేయగలవాడే, సమర్థుడైన సేనాధిపతి. ఆ పని వీరకేతుడు చేయగలిగాడు; అమరసేనుడు విఫలుడయ్యాడు. పోతే, అమరసేనుడిలో గల దేశభక్తినీ, స్వదేశాభిమానాన్నీ గుర్తించిన రాజు, అతడికి వేగుల శాఖాధిపత్యం ఒప్పగించాడు. అలాంటి పదవికి అంతకన్న గొప్ప అర్హతలు మరేమీ వుండవు. అందువల్ల, రాజు చేసిన నిర్ణయం సరి అయినదే,'' అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)





# విదూషకుడి ప్రశ్నలు

ఉజ్జయినీనగర రాజైన మాధవవర్మ ఆస్థానంలో ప్రసిద్ధులైన చాలామంది పండితులుండేవారు. ఒకనాడు, ఆయన సభతీరివుండగా, కంచుఢక్కా మోగిస్తూ, మధ్యవయసు వాడొకడు సభలో ప్రవేశించాడు.

ఏ ఆహ్వానం లేకుండా, అలా సభలో ప్రవేశించిన అతడికేసి రాజు ఆశ్చర్యంగా చూసేంతలో, "మహారాజా, నా పేరు సోమశేఖరుడు. కళింగరాజ్యం వాణ్ణి. పది సంవత్సరాలుగా దేశం నలుమూలలా తిరుగుతూ, అనేక రాజాస్థానాలలోని పండితులను వాదనలో ఓడించాను. మీ ఆస్థానంలో గొప్ప పండితులైన వారు కొందరున్నారని తెలిసి, యిక్కడికి వచ్చాను," అన్నాడు.

రాజు మాధవవర్మ సభలోని తన పండితులకేసి ఒకసారి చూసి, సోమశేఖరుణ్ణి, "మీరనే వాద ప్రతివాదాలకు నియమాలేమిటి ? ఆ సంగతి ముందు చెప్పండి," అని అడిగాడు.

"ఎవరైనా సరే, పండిత పామరభేదం లేకుండా నన్ను ఎలాంటి ప్రశ్నలైనా అడగవచ్చు. ఒకవేళ వాటికి నేను సరిఅయిన సమాధానాలు యివ్వలేకపోతే, యీ కంచుఢక్కను పగలగొట్టి, బతికినన్నాళ్ళూ వారికి సేవకుడుగా వుంటాను. అలాకాక, ప్రశ్నలడిగిన వారు ఓడిపోవడం జరిగితే, వాళ్ళు నా పాదాలకు నమస్కరించి, నన్ను మహా పండితుడిగా అంగీకరిస్తే చాలు," అన్నాడు సోమశేఖరుడు.

సభలోని పండితులు యిందుకు ఒప్పుకున్నారు.

తరవాత సోమశేఖరుణ్ణి, పండితులు అనేక శాస్త్రవిషయాలను గురించి ఒకరొకరుగా ప్రశ్నలడిగారు. అన్నిటికీ సోమ

బల్లెం ప్రసాదరావు

శేఖరుడు సరి అయిన జవాబులిచ్చి, వారిని ఓడించాడు.

పండితుల ఓటమి చూసి రాజు చాలా కలత చెందాడు. తన ఆస్థానంలోని పండితుల పాండిత్యాన్ని గురించి ఆయనకు ఇంతకాలంగా గొప్ప అభిప్రాయం వున్నది.

సోమశేఖరుడు విజయ సూచకంగా కంచుఢక్కను మోగించి, "మహారాజా, నా నియమాలేమిటో ముందే చెప్పాను. మీ పండితులందరూ చిత్తుగా ఓడిపోవడం జరిగింది. నేను, మరొక రాజాస్థానానికి వెళ్ళి, అక్కడి పండితులను ఓడించేందుకు వేగిరపడుతున్నాను," అన్నాడు గర్వంగా.

సభలోని పండితులు అవమానంతో తలలు వంచుకుని, సోమశేఖరుడి పాదాలకు నమస్కరించేందుకు బయలుదేరుతున్నంతలో, రాజుగారి విదూషకుడు ముందుకు వచ్చి, సోమశేఖరుణ్ణి, "నేను పండితుణ్ణి కాదు, పామరుణ్ణి. నా ప్రశ్నలకూ తమరు జవాబులివ్వగలరా?" అని అడిగాడు.

ఆ ప్రశ్నకు సోమశేఖరుడు నవ్వి, "నువ్వు పండితుడివి కాదనేది, నీ వేషధారణే చెబుతున్నది! నేను, ముందే మహారాజుగారికి చెప్పా గదా, ఎటువంటి



వారడిగిన ప్రశ్నలకైనా సరయిన జవాబులివ్వగలను. అలా కానప్పుడు, బతికినంత కాలం వారికి సేవ చేస్తాను," అన్నాడు.

"అయితే, నా ప్రశ్న వినండి! ఇద్దరు మూర్ఖులు దారే పోతూ, పక్కన వున్న మురుగు కాలవలో పడ్డారు. ఒకడి ఒంటికి బురద అయింది; మరొకడికి కాలేదు. వాళ్ళల్లో ఎవరు స్నానం చేస్తారు?" అన్నాడు విదూషకుడు.

"ఒంటికి బురద అయినవాడే," అన్నాడు సోమశేఖరుడు.

"కాదు. ముందే చెప్పా గదా, వాళ్ళు మూర్ఖులని! ఒంటికి బురద అయినవాడు,

రెండోవాణ్ణి చూసి తనకు బురద కాలే దనుకుంటాడు. బురదకాని వాడు, ఎదటి వాణ్ణి చూసి తన ఒంటికీ బురద అయిం దనుకుని పోయి స్నానం చేస్తాడు,'' అన్నాడు విదూషకుడు.

ఈ జవాబు యుక్తియుక్తంగా వుండ డంతో సోమశేఖరుడు వెలవెలపోయాడు.

విదూషకుడు ఉత్సాహంగా, ''మరొక ప్రశ్న వినండి! ఇద్దరు తెలివైన వాళ్ళు దారే పోతూ పక్కన వున్న మురుగు కాలవలో పడ్డారు. ఒకడికి బురద అంటింది; రెండో వాడికి అంటలేదు. వాళ్ళల్లో ఎవరు అంటిన బురద వది లించుకునేందుకు స్నానం చేస్తారు?'' అన్నాడు.

విదూషకుడి మొదటి ప్రశ్న గుర్తుకు తెచ్చుకుని, సోమశేఖరుడు, ''ఒంటికి బురద అంటనివాడు,'' అని జవాబు చెప్పాడు.

విదూషకుడు బిగ్గరగా నవ్వి, ''నేను ముందే చెప్పాగదా, వాళ్ళిద్దరూ తెలివైన వాళ్ళని! ఆ కారణంచేత, బురద అంటిన వాడే పోయి స్నానం చేస్తాడు,'' అన్నాడు.

సభలోని వాళ్ళందరూ సంతోషంగా చప్పట్లు చరిచారు. తాను మరొకసారి ఓడినట్టు తెలుసుకున్న సోమశేఖరుడు బిక్కచచ్చిపోయి, దిక్కులు చూడ సాగాడు.

విదూషకుడు అతణ్ణి సమీపించి, ''దారేపోయే ఇద్దరు మనుషులు మురుగు కాలవలో పడితే, ఒకరికి బురద అంటడం, మరొకరికి అంటకపోవడం ఏమిటి? మహాపండితుణ్ణని కంచుఢక్క మోగించి మరీ చెప్పాకునే మీకు, ఈ మాత్రం తెలియదా?'' అన్నాడు.

సోమశేఖరుడు ఎంతో వినయంగా తన కంచుఢక్కను విదూషకుడి పాదాల ముందు పెట్టాడు.

రాజు మాధవవర్మ అతణ్ణి మరింతగా అవమానపరచడం మర్యాద కాదని భావించి, అతడు సభ వదిలిపోయేందుకు అనుమతించాడు.





# గుడ్డి న్యాయం

బొగ్దాదునగరంలో ముగ్గురు గుడ్డి బిచ్చగాళ్ళు కలిసి జీవిస్తుండేవారు. వారు రోజల్లా నగరపు వీధులలో తిరిగి ముష్టి ఎత్తి తిండికి ఖర్చుకాగా మిగిలిన సంపాదనను తాముండే ఇంట్లో ఒక చోట భద్రంగా దాచేవారు. ఈ విధంగా వారు పన్నెండు వందల వెండి దిరాములు పోగుచేశారు.

ఒకనాడు వారిలో ఒకడు ఒక వీధి ప్రవేశించి ఒక ఇంటి తలవాకిలి తలుపు తట్టాడు.

లోపలినుంచి ఇంటి యజమాని, "ఎవరు వారు ?" అని అడిగాడు. కాని గుడ్డివాడు జవాబు చెప్పక, మళ్ళీ తలుపు తట్టాడు. తాను బిచ్చగాడని చెబితే ఇంటివాళ్ళు తలుపు తెరవకుండానే, "ఇప్పుడేం లేదు పో," అంటారు. ఈ సంగతి గుడ్డి బిచ్చగాడెరుగును.

ఇంటి యజమాని, "ఎవరు వారు ?" అని రెండోసారి కేకపెట్టినా జవాబురాక పోయేసరికి, తలుపు తెరిచి గుడ్డి వాణ్ణి చూసి, "ఎవరు నువ్వు?" అని అడిగాడు.

"గుడ్డివాణ్ణి బాబయ్యా. కరుణించండి," అన్నాడు బిచ్చగాడు.

వెంటనే ఇంటి యజమాని బిచ్చగాడికి చెయ్యి అందిస్తూ, "నా చెయ్యి పట్టుకుని లోపలికిరా," అన్నాడు.

తన పంట పండింది కదా అనుకుని బిచ్చగాడు ఇంటి యజమాని వెంబడి మేడ మీద మూడో అంతస్తుదాకా ఎక్కి వెళ్ళాడు.

"ఇక్కడ కూచుని, నీకేం కావాలో చెప్పు," అన్నాడు ఇంటి యజమాని.

"ఆకలి మండిపోతోంది. ఇంత తిండి పెట్టించినాసరే, ఏమైనా డబ్బులు దయచేయించినాసరే," అన్నాడు బిచ్చగాడు.

"అదా సంగతి! ఇక్కడ ఏమీలేదు. మరో ఇల్లు చూసుకో," అన్నాడు ఇంటి యజమాని.

"ఈ భాగ్యానికి ఇన్ని మెట్లు ఎక్కించాలా, బాబూ? ఈ సంగతి కిందనే చెబితే పోయేదిగా?" అన్నాడు బిచ్చగాడు.

"ఎవరు వారని అడిగితే జవాబు చెప్పకపోవటమేం?" అన్నాడు ఇంటి యజమాని కోపంగా.

"ఇంతకూ ఏమిటి సెలవు?" అన్నాడు బిచ్చగాడు.

"నీ కివ్వటానికి నా దగ్గిర చిల్లిగవ్వ లేదు. మరి నోరెత్తకుండా పో," అన్నాడు ఇంటి యజమాని.

"అయితే నన్ను మళ్ళీ కిందికి చేర్చండి," అన్నాడు బిచ్చగాడు.

"నాకిదే పనా? నీ దారి నువే చూసుకో!" అన్నాడు ఇంటివాడు.

బిచ్చగాడు నిట్టూర్చి లేచి, తడువుకుంటూ మెట్ల వద్దకు వెళ్ళాడు. మెట్లు దిగేటప్పుడు సగం దారిలో కాలు జారింది. బిచ్చగాడు ముక్కుతూ మూలుగుతూ లేచి ఎలాగో వీధిలోకి చేరుకున్నాడు.

సరిగా ఆ సమయానికే మిగిలిన ఇద్దరు గుడ్డి బిచ్చగాళ్ళూ ఆ వీధికి వచ్చారు. మూడోవాణ్ణి మూలుగునిబట్టి పోల్చుకుని దగ్గిరకు వచ్చి, "ఏం జరిగింది?" అని అడిగారు.



గాయాలు తగిలినవాడు తన మిత్రు లతో జరిగినదంతా చెప్పి, ''ఇవాళకు నేను తిరగలేను. మీ దగ్గిర ఒక దిరా ముంటే ఇవ్వండి. దుకాణంలో భోం చేస్తాను,'' అన్నాడు.

''మాకూ దుర్దినమే, ఏమీ దొరకలేదు. ఇంటికి పోదాం,'' అని మిగిలిన ఇద్దరు గుడ్డివాళ్ళూ అన్నారు.

ఈ బిచ్చగాళ్ళ సంభాషణ యావత్తూ, ఇంటి యజమాని విన్నాడు. వాడొక పచ్చి దొంగ. తన ఇంటికి వచ్చిన గుడ్డివాడి వెనకనే వాడు కూడా వచ్చి, వాళ్ళుండే ఇంటికి బయలుదేరాడు.

త్వరలోనే ముగ్గురు బిచ్చగాళ్లూ, తమ ఇల్లు చేరుకుని, తాళం తెరిచి లోపలికి వెళ్ళి వెంటనే తలుపు వేసుకున్నారు. కాని ఈలోపునే దొంగ కూడా లోపల చేరాడు.

గుడ్డివాళ్ళు పెట్టె తెరిచి తమ సొత్తంతా లెక్క పెట్టుకున్నారు. పన్నెండువందల వెండి దిరాములున్నాయి. అందులో ఒకటి తీసి ఒక గుడ్డివాడు రొట్టెలూ, కూరలూ కొనుక్కొచ్చాడు. ముగ్గురూ కూచుని తిండి తినసాగారు. వారి పక్కనే చేరి దొంగ కూడా తినసాగాడు.

''నలుగురు నములుతున్న చప్పుడు వినిపిస్తున్నది. నాలుగోవాడెవడు? దొంగ!'' అన్నాడు ఒక గుడ్డివాడు. మరుక్షణం వాళ్ళు ''దొంగ! దొంగ!'' అని కేకలు పెట్టసాగారు.



ఈ కేకలు విని నలుగురూ వచ్చేసరికి దొంగ, తాను కూడా గుడ్డివారిలో ఒకడైనట్టు కళ్ళు మూసుకుని కూచుని, "అయ్యా, బాబూ! మమ్మల్ని కొత్వాలు గారి దగ్గరకు తీసుకుపొండి. ఆయనకు ఒక రహస్యం విన్నవించాలి," అన్నాడు.

వెంటనే, అక్కడ చేరిన జనం నలుగురూ గుడ్డివాళ్ళను, కొత్వాలు వద్దకు పట్టుకుపోయారు.

"ఎవరు వీళ్ళు? ఎందుకు వచ్చారిక్కడికి?" అని కొత్వాలు అడిగాడు.

"బాబూ, మేము ముగ్గురమూ గుడ్డి బిచ్చగాళ్ళం. ఎవడో దొంగ మా ఇంట ప్రవేశించి మేము కష్టపడి సంపాదించిన సొత్తు కాజేయ యత్నిస్తున్నాడు," అన్నాడు గుడ్డివారిలో ఒకడు.

"ఆ దొంగ ఏడీ? నిజం చెప్పండి," అన్నాడు కొత్వాలు.

"కమ్చీ దెబ్బ తగలందే నిజం చెబుతామా, బాబూ?" అన్నాడు కళ్ళు మూసుకుని వున్న దొంగ.

"అయితే నిజం చెప్పేదాకా వీళ్ణి కొరడాతో కొట్టండి." అన్నాడు కొత్వాలు, భటులతో.

రెండు దెబ్బలు పడ్డాయో లేదో, దొంగ కళ్ళు తెరిచి, "క్షమించాలి బాబూ, నిజం చెప్పేస్తాను. నన్ను వదిలెయ్యండి. మేము నలుగురమూ గుడ్డివాళ్ళల్లే నటిస్తూ నగరంలో ముప్పైరెండు పన్నెండు వందల వెండి దిరాములు సంపాదించుకున్నాం. నిజం చెప్పాను గనక నా వంతు నా కిప్పించండి. గట్టిగా నాలుగు తగిలించారంటే వాళ్ళు కూడా నిజం ఒప్పుకుంటారు!" అన్నాడు.

కొత్వాలు వాడి మాటలు నమ్మి వాడికి మూడు వందల దిరాములు ఇచ్చి పంపేశాడు, తరవాత ఆయన మిగిలిన ముగ్గురు గుడ్డివాళ్ళను ఎంత కొట్టించినా వాళ్ళు కళ్ళు తెరవనేలేదు. చివరకు స్పృహతప్పి పడిపోయినాక కొత్వాలు వాళ్ళను వదిలేసి, వాళ్ళు ఎంతో కాలంగా కూడబెట్టిన సొమ్ము తాను తీసుకున్నాడు.





# అమృతసిద్ధి

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, సామంతరాజయిన చిరాయు వద్ద నాగార్జును డనే పేరుతో బోధిసత్త్వుడు ముఖ్యమంత్రిగా వుండేవాడు.

నాగార్జునుడు దయాళువూ, దాన శీలుడూ అని పేరుగాంచాడు. అంతేకాదు, రసాయనశాస్త్రంలోనూ, ఓషధీజ్ఞానం లోనూ గొప్పనిధి. అతడు, తనకు తెలిసిన రసాయనిక ప్రయోగంలో ఒక రహస్య యోగం కనిపెట్టి, తనకూ, రాజుకూ జరా మరణాలు లేకుండా చేసుకున్నాడు.

ఒకనాడు అతని కొడుకులలోకెల్లా తనకు ప్రేమాస్పదుడైన సోమదేవుడు చనిపోవడం తటస్థించింది. కుమారుని చావు నాగార్జునుడికి అంతులేని దుఃఖం కల్గించింది. సహజంగా కరుణాళువైన నాగార్జునుడు, ''ఇకమీదట లోకంలో మరణమనేదే వుండకూడదు. మరణం ద్వారా ఎవరూ శోకించకూడదు. అందుకు తగిన ఉపాయం కనిపెట్టాలి,'' అని ఆలోచించసాగాడు.

''రసాయనాలైతే అమిత వ్యయంతో కూడుకున్నపని. అందువల్ల సామాన్యులకు కూడా అందుబాటులో వుండే మూలికల తోనే అమృతం తయారు చేయాలి. అప్పుడే ప్రజలందరు కూడా శోకానికి లోనుకాకుండా సుఖంగా వుండగలరు,'' అని నాగార్జునుడు నిశ్చయించాడు.

నిశ్చయం ప్రకారం ఓషధుల సంపుటితో అమృతం తయారు చేయడానికి పూను కున్నాడు. తనకున్న శాస్త్రపరిజ్ఞానాన్నంత టినీ వినియోగించి అనేక పరిశోధనలు చేశాడు. చాలావరకు ప్రక్రియలన్నీ పూర్తి అయినాయి. నాగార్జునుడి యత్నం చివరి ఘట్టానికి వచ్చింది. 'అమృతకల్పం' అనే మూలిక ఒక్కటి చేర్చాలి.

జాతకకథ

అంతలో, ఈ సంగతి దేవేంద్రుడికి తెలియవచ్చింది. వెంటనే దేవేంద్రుడు అశ్వినీదేవతలను పిలిచి, "మీరు ఇప్పుడే భూలోకానికి పోయి, ఎలాగైనా నాగార్జునుడు తలపెట్టిన 'అమృతయోగం' సిద్ధించకుండా చేయాలి. సామదానభేద దండోపాయాలన్నిటినీ ప్రయోగించండి. తక్కిన పని నేను చూస్తాను," అన్నాడు.

అశ్వినీదేవతలు మారురూపాలతో భూలోకానికి దిగివచ్చి, నాగార్జునుణ్ణి దర్శించి, కుశలప్రశ్నలు ప్రారంభించారు. "మంత్రిపుంగవా, రాజ్యాలనే తలకిందులు చేయగల యుక్తులు తెలిసిన ఘనుడవైన నీకు తెలియని విషయం లేదు. కాని ఇప్పుడు బ్రహ్మసంకల్పానికే నిరోధం కల్గించడానికి సాహసిస్తున్నావు. మానవుల ధర్మగతి అయిన మరణాన్ని నువ్వు 'అమృతసిద్ధి' చేత ప్రతిబంధించినట్లయితే, సృష్టిపరిపాలనే తారుమారవుతుంది కదా? మానవుడు ఒక్కడూ చావకుండా వుంటే, ఎన్ని లోకాలైనా సరిపోగలవా? పైగా, దేవతలు చేయవలసిన ఈ కార్యం మానవమాత్రుడవైన నువ్వే సాధించడానికి పూనుకుంటే, దేవతలకూ, మానవులకూ వ్యత్యాసం వుంటుందా? ఇంతకూ నీ కొడుకు చనిపోయాడనే దుఃఖంతోనే కదా ఇంత పని చేస్తున్నావు? నీ కుమారుడు భూలోకం వదిలినా, స్వర్గంలో సుఖంగానే వున్నాడు," అని ధర్మబోధ చేశారు.



ఈ మాటలు నాగార్జునుడి మనస్సుకు అంతగా తృప్తి కలిగించలేదు. తను చేస్తున్న పని తప్పు అవుతుందా కాదా అన్న ఆలోచనలో మునిగిపోయాడు.

ఆ సమయంలోనే చిరాయు పుత్రుడైన జయసేనుడి యువరాజ్యాభిషేకానికి ఘనమైన ఏర్పాట్లు జరిగినై.

ఈ లోపల, వృద్ధబ్రాహ్మణ రూపంలో భూలోకానికి చేరుకున్న దేవేంద్రుడు జయసేనుణ్ణి సమీపించి, ఇలా అన్నాడు: ''నాగార్జునుడు తయారు చేసిన రసాయనిక సేవనవల్ల నీ తండ్రికి జరామరణాలే లేవుగదా! అటువంటప్పుడు నువ్వు యువరాజుగా వుండి పోవలసిందే కాని, నీకు రాజ్యార్హత ఎప్పటికీ కలగదు.''

ఆ మాట విన్న జయసేనుడు విచారంతో కుంగిపోయాడు. అప్పుడు ఆ వృద్ధ బ్రాహ్మణుడు, ''నాయనా, ఈపాటిదానికే ఖేదపడకు. నీ కోరిక నెరవేరడానికి సులువైన ఉపాయమున్నది. రోజూ భోజనం ముందు, ఎవరేమి అడిగినా లేదనకుండా ఇవ్వడం నాగార్జునుడికి మామూలు. రేపు నువ్వు ఆ వేళకు వెళ్ళి, ఏమాత్రం జంకకుండా, ''నాకు నీ తల కావాలి!'' అని అడుగు. తరవాత ఏం జరుగుతుందో నువ్వే చూద్దువుగాని.'' అని మనసుకు నచ్చేటట్టు నూరిపోశాడు.

రాజ్యకాంక్షతో వున్న జయసేనుడు మరునాడు భోజనాలవేళ నాగార్జునుడి వద్దకు వెళ్ళి, సరిగ్గా వృద్ధుడు చెప్పినట్టే



కోరాడు. నాగార్జునుడు కొంచెమైనా సంశయించకుండా, తన కత్తి జయసేనుడి చేతికిచ్చి, ''నాయనా! తల తెగ్గొట్టి తీసుకో! భయపడకు,'' అన్నాడు. రసాయన ప్రభావం వల్ల నాగార్జునుడి శరీరం వజ్రకాయమై వుండడం వల్ల జయసేనుడు ఎన్నిసార్లు నరికినా, కత్తి తూలుతూ వుంది గాని, నాగార్జుడి తలమాత్రం తెగలేదు!

ఈ సమాచారం ఒక్క క్రుటిలో రాజుకు తెలిసి, ఆయన ఆత్రంతో పరుగెత్తి వచ్చాడు. కొడుకు చేస్తున్న పనికి విచారించి, వానిని వారింప బోయాడు.

అప్పుడు నాగార్జునుడు, ''మహారాజా, యువరాజు కోరిన కోరికకు పూర్వాపరాలు అన్నీ నాకు తెలుసు. అతడు నిమిత్తమాత్రుడు కనుక అతడిని ఆటంక పరచవద్దు. ఇప్పటివరకూ గతజన్మలలో నేను తొంభై తొమ్మిదిసార్లు, లేదనకుండా నా తల కొట్టి ఇచ్చివున్నాను. ఇది నూరవది. ఈ కొంచెంలో వెనుకంజ వేశానని అపకీర్తి రాకుండా మాటదక్కించ వలసిన భారం మీపై వున్నది,'' అంటూ ఆఖరిసారిగా భక్తితో రాజును ఆలింగనం చేసుకున్నాడు.

తరవాత తన వద్ద నున్న మూలికలలో ఒకటి తీసి, కత్తికిరాసి, జయసేనుడితో, ''ఇప్పుడు కొట్టు నాయనా,'' అన్నాడు.

జయసేనుడు ఈసారి కత్తితో నరకగానే, నాగార్జునుడి తల కాడ నుండి వూడిన కమలంలాగా కిందపడింది!

ఆ దృశ్యం చూడలేక, రాజు కూడా ప్రాణత్యాగం చేయడానికి సిద్ధమయ్యాడు.

అప్పుడు, కింద పడిన నాగార్జునుడి మొండితల, ''రాజా, విచారించకు! ఎన్ని జన్మలకైనా నీ తోనే వుంటాను,'' అంటూ ప్రాణం విడిచింది.

రాజు పూర్తి విరాగి అయ్యాడు. వెంటనే కొడుక్కు పట్టాభిషేకం కట్టి, తను తపస్సు చేసుకోడానికి అడవులకు వెళ్ళిపోయాడు.

ఈ విధంగా జయసేనుడికి రాజ్యం లభించింది. దేవేంద్రుడి వ్యూహం నెరవేరింది.






# మహమ్మద్-బిన్-తుగ్లక్

ఢిల్లీ అధికారం 1320 వ సంవత్సరంలో తుగ్లక్ వంశస్థాపకుడైన ఘియాజుద్దీన్ కైవసమయింది. అతడు సింహాసనం అధిష్ఠించేనాటికి వృద్ధుడు. అతడు బెంగాల్ నుంచి తిరిగి వస్తూన్నప్పుడు స్వాగతం పలకడానికి ఢిల్లీ సమీపంలో ప్రత్యేకంగా ఒక ద్వారతోరణం ఏర్పాటు చేయబడింది.

ఘియాజుద్దీన్ ఢిల్లీని సమీపిస్తున్నాడని వినగానే నిజాముద్దీన్ అనే పేరు గాంచిన ముస్లిం సన్యాసి, "సుల్తానుకు ఢిల్లీ ఇంకా చాలా దూరంలోనే వున్నది," అన్నాడు. ఆ మాట ఆ తర్వాత అక్షరాలా నిజమయింది!





ఘియాజుద్దీన్ ద్వారతోరణం కిందికి రాగానే, అది విరిగి అతడి మీద పడింది. అతడు అక్కడికక్కడే మరణించాడు. సుల్తాన్ మరణం ప్రమాదవశాత్తు వాటిల్లినట్టు కనిపించినప్పటికీ, అది సుల్తాన్ కుమారుడు ఉలూఘ్ ఖాన్ పన్నిన పన్నాగమే అని పలువురు భావించారు.



ఉలూఘ్ ఖాన్ మహమ్మద్ - బిన్ - తుగ్లక్ పేరుతో ఢిల్లీ సుల్తాన్ అయ్యాడు. చంచలస్వభావం గల తుగ్లక్ తన రాజధానిని ఢిల్లీ నుంచి దేవగిరికి మార్చాలని తీర్మానించాడు. దౌలతాబాద్ అని పేరు మార్చిన దేవగిరి ఢిల్లీకి ఏడు వందల మైళ్ళ దూరంలో వుంది. అక్కడ ఒక కోట, అనేక భవనాలు నిర్మించబడ్డాయి.

ప్రభుత్వ కార్యాలయాలను మాత్రమే కాకుండా ఢిల్లీ పౌరులందరినీ కూడా దౌలతాబాదుకు తరలించాలని సుల్తాన్ ప్రకటించాడు. సుల్తాన్ నిర్ణయం విన్న ప్రజలు తరతరాలుగా నివసిస్తున్న ప్రాంతాన్ని, ఆస్తిపాస్తులను వదులుకుని కొత్త చోటికి వెళ్ళడానికి సమ్మతించలేదు.





అలా-వెళ్ళడానికి తిరస్కరించిన పౌరులందరినీ బెదిరించి మరీ దేవగిరికి నడిపించారు. చివరికి గుడ్డివాళ్ళనూ, కుంటివాళ్ళనూ కూడా వదలకుండా సైనికులు బలవంతంగా లాక్కుపోయారు. అందువల్ల చాలామంది దారిలోనే ప్రాణాలు పోగొట్టుకున్నారు. ప్రాచీనమైన ఢిల్లీనగరం నిర్మానుష్యమయింది.

కాని, దౌలతాబాదులో ప్రజలజీవితం సుఖంగా సాగలేదు. అధికారులందరికీ ఢిల్లీనగరమే మేలనిపించింది. చివరికి సుల్తాన్‌కు కూడా నూతన రాజధాని నచ్చలేదు. ఉన్నట్టుండి తుగ్లక్ మళ్ళీ ప్రజలంతా ఢిల్లీకి తిరిగి వెళ్ళాలని ప్రకటించాడు. అందరికీ తిరిగి వెళ్ళాలని వున్నప్పటికీ సుల్తాన్ చంచల స్వభావం వారికి కోపం తెప్పించింది.





తిరుగు ప్రయాణం ఒక పథకం ప్రకారం సాగలేదు. అంత దూరం నడవలేక చాలామంది మార్గమధ్యం లోనే చనిపోయారు. మరి కొందరిని దారిదోపిడీ దొంగలు దోచుకున్నారు. మిగిలినవారు ఢిల్లీ చేరారు. కాని అక్కడి ఇళ్ళన్నీ శిథిలమై వున్నాయి. దివాలా తీసిన సుల్తాన్ ప్రభుత్వం ప్రజలు దాచుకున్న కొద్దిపాటి ధనాన్ని కూడా లాక్కున్నది.

ప్రభుత్వ ఖజానా ఖాళీ కావడంతో, సుల్తాన్ బంగారు, వెండి నాణాల స్థానే రాగినాణాలు ప్రవేశపెట్టాడు. దానితో కొందరు తమ దగ్గర వున్న రాగిపాత్రలను, సొమ్ములను కరిగించి సొంతంగా నాణాలు తయారు చేశారు. ఆర్థిక సంక్షోభం ఏర్పడడంతో సుల్తాన్ అదనపు పన్నులు విధించాడు. పన్నులు చెల్లించలేనివారు నానా హింసలకు గురికావలసి వచ్చింది.






సుల్తాన్ రాజ్య విస్తరణకు కూడా పూనుకుని మూడులక్షల డెబ్బైవేల మంది సైనికులను సమకూర్చుకున్నాడు. మొదట పర్షియా మీద దండెత్తాలనుకున్నాడు కాని, ఆ తర్వాత ఆ ఉద్దేశాన్ని మార్చుకుని కుమాన్ ప్రాంతంలోని చిన్న, చిన్న రాజ్యాలను తన సామ్రాజ్యంలో కలుపుకోవాలని కొండలకేసి సైన్యాన్ని నడిపించాడు.

కాని దానిక్కూడా కాలం కలిసి రాలేదు. ఋతుపవనాలు అప్పుడే ప్రారంభమయినై. తుపాను ధాటికి కొండచరియలు విరిగి సైన్యం మీద పడసాగాయి. కొండ ప్రాంతాలను పాలించే చిన్న, చిన్న నాయకులు సైతం ఈ దురాక్రమణను ఎదుర్కొని శత్రుసైన్యాన్ని ముప్పుతిప్పలు పెట్టారు. ఆ విధంగా చాలామంది సైనికులు ప్రాణాలు కోల్పోయారు.





అతడి సామ్రాజ్యమంతటా పితూరీలు, తిరుగుబాట్లు చెలరేగాయి. సింధు ప్రాంతంలో తిరుగుబాటును అణచడానికి వెళ్ళిన మహమ్మద్-బిన్-తుగ్లక్ విష జ్వరానికి గురయి 1351వ సంవత్సరంలో మరణించాడు. చిన్న చిన్న సామంతరాజులు సైతం స్వాతంత్ర్యం ప్రకటించుకోవడంతో తుగ్లక్ సామ్రాజ్యం చిన్నాభిన్నమయింది.

# లొంగుబాటు

సింహపురి, వజ్రగిరి ఇరుగుపొరుగు రాజ్యాలు. సింహపురితో పోల్చితే, వజ్రగిరి చాలా బలహీన మైన రాజ్యం. అయినా, రాజ్యకాంక్షగల వజ్రగిరి రాజు కాలకేతు, సింహపురి రాజైన వీరసింహుడితో యుద్ధానికి తలపడి, చాలాసార్లు ఓడిపోయాడు.

ఏదైనా కుతంత్రంతో వీరసింహుణ్ణి బంధించాలని కాలకేతు ఆలోచించాడు. అతడు ఒక దూతను ఆయన వద్దకు పంపి, రెండు రాజ్యాల మధ్యా శాశ్వత సంధి గురించి మాట్లాడేందుకు రావలసిందిగా ఆహ్వానించాడు. వీరసింహుడు అందుకు ఒప్పుకున్నాడు.

నాలుగు రోజుల తరవాత, కొద్దిమంది అంగరక్షకులతో తన నగరం వచ్చిన సింహపురి రాజు గౌరవార్థం, కాలకేతు విందు ఏర్పాటు చేశాడు. ఇప్పుడు వీరసింహుణ్ణి బంధించడం చాలా తేలిక అని భావించిన కాలకేతు, ఆయనను ఆటపట్టించాలనుకుని, "ఒక రాజు, తన శత్రురాజును నమ్మించి విందుకు ఆహ్వానించి—ఇప్పుడు నిన్ను బంధిస్తున్నానంటే, ఆ రాజు పరిస్థితి ఎలా వుంటుంది?" అని అడిగాడు.

"శత్రు రాజు తెలివైనవాడైతే, పగవాణ్ణి నమ్మి విందుకు రానేరాడు!" అన్నాడు సింహపురి రాజు. ఆ జవాబుతో కాలకేతుకు అనుమానం గలిగి, "ఎవరు నువ్వు?" అని గద్దించి అడిగాడు.

"నేను వీరసింహ రాజుగారి ప్రధాన అంగరక్షకుణ్ణి!" అంటూ అతడు తన మారు వేషం తొలగించి, "కాలకేతూ, మా రాజుగారు నిన్ను యుద్ధంలో ఎన్నిసార్లు ఓడించినా, నిన్ను ప్రాణాలతో వదిలాడే తప్ప, సామంతుడుగా చేసుకునే ప్రయత్నం చెయ్యలేదు. ఇప్పుడు మా సైన్యాలు సరిహద్దు దాటి, దాడి చేసేందుకు సిద్ధంగా వున్నవి. నువ్వేం చెప్పదలిచావు?" అని అడిగాడు. కాలకేతు వణికిపోతూ, "నేను సింహపురి రాజుగారి సామంతుణ్ణి! ఆ సంగతి స్వయంగా మహారాజుకు మనవి చేసుకునేందుకు, యిప్పుడే నీ వెంట బయలుదేరి వస్తాను," అన్నాడు.

—దాసరి వెంకటరమణ





# నాట్య ప్రశంస

లక్షణదేశంలో చూడామణి అనే నర్తకి వుండేది. ఆమె అనేక రాజసభలలో తన నాట్యకౌశల్యాన్ని ప్రదర్శించి, అందరిచేతా తనకుతానే సాటి అనిపించుకున్నది.

ఒకసారి ఆమె, మాళవరాజు కొలువులో తన నాట్యవిద్య ప్రదర్శించింది. ఆమె నాట్యం చూసి రాజుతోపాటు, సభలోని వారంతా ముగ్ధులైపోయారు.

రాజు, బహుమతులివ్వబోతున్న సమయంలో ఆమె, ''మహారాజా, నాట్యశాస్త్రంలో ప్రమాణ గ్రంథం రాసిన లలితాచార్యుల వారిప్పుడు, మీ ఆస్థానంలోనే వున్నారు కదా! నన్ను గురించి వారు నాలుగు మాటలు చెప్పడం కన్న, నాకు వేరే బహుమానాలెందుకు,'' అన్నది.

రాజు, చూడామణి వినయానికి ముచ్చటపడి, లలితాచార్యుణ్ణి మాట్లాడవలసిందిగా కోరాడు.

లలితాచార్యుడు తన ఉన్నతాసనం మీది నుంచి లేచి, ''చూడామణి నాట్యవిద్యలో పరిపూర్ణమైన ప్రజ్ఞ సాధించాలనుకుంటున్నది. ఇందుకుగాను, ఈమె నేర్చుకోవలసిన కొన్ని మెలుకువలు చెబుతాను,'' అంటూ నాట్యశాస్త్ర సంబంధమైన కొన్ని ముఖ్యవిషయాలు చెప్పాడు. అంతేగాని, చూడామణి అంతకుముందు చేసిన నాట్యప్రదర్శనను గురించి ఒక్క మాట కూడా చెప్పలేదు.

మరసటి రోజున లలితాచార్యుడి దగ్గరకు చూడామణి సేవకుడొకడు వచ్చి, తన యజమానురాలు యివ్వమన్నదంటూ ఒక ఉత్తరంతోపాటు, విలువైన పట్టు బట్టలో అందంగా మూట కట్టబడిన వస్తువొకటి, ఆయనకు యిచ్చాడు.

లలితాచార్యుడు ఉత్తరం మడతలు విప్పి చదివాడు. అందులో యిలా వున్నది:

జొన్నలగడ్డ రత్న

రాజులెందరి చేతనో సన్మానా లందుకుని, నాట్యవిద్యలో దిట్ట అనిపించుకున్నాను. అలాంటి నేను, నాట్యశాస్త్రం అవపోసన పట్టిన మీకు, ఏదైనా కానుక యివ్వకుండా యీ దేశం విడిచిపోవడం యిష్టం లేదు. నేను ఎప్పుడూ గుర్తుండాలని ఆశిస్తూ, యీ బహుమానం పంపిస్తున్నాను.

లలితాచార్యుడు మూట విప్పి చూసి ఎక్కడలేని ఆశ్చర్యం పొందాడు. అందులో తుక్కూ దూగరా తప్ప మరే వస్తువూ లేదు. చూడామణి అహంకారానికి ఆయన ఒక్కక్షణం నివ్వెరపడినా, తమాయించుకుని, ఆమెకు యిలా ఉత్తరం రాశాడు:

నువ్వు పంపిన బహుమతి అందింది. పైన కట్టిన పట్టుగుడ్డ, అందంగా వుండే నిన్ను గుర్తు చేస్తుంటే, లోపల నువ్వు పెట్టి పంపినవి, నీ మనసెలాంటిదో తెలిపాయి. నువ్వు యిచ్చుకోగలిగినవీ, నీ తాహతుకు తగినవీ అయిన వస్తువులే, నాకు బహుమానంగా పంపావు. నీ బహుమతి, నిన్ను ఎప్పుడూ గుర్తుండేలా చేసింది.

సేవకుడు ఆ ఉత్తరం తీసుకుపోయి చూడామణికి యిచ్చాడు. అది చదివాక ఆమెకు తాను చేసింది ఎంత పెద్ద తప్పో తెలిసి వచ్చింది. ఆమె లలితాచార్యుడి దగ్గిరకు వెళ్ళి, ఆయనను క్షమాపణ కోరి, సాష్టాంగపడింది.



లలితాచార్యుడు ఆమెను లేవదీసి, "నీవు చక్కని నాట్యకత్తెవు. ఈ విషయంలో నే నేనాడూ సందేహ పడలేదు," అన్నాడు.

చూడామణి ఆశ్చర్యంగా, "ఈ సంగతి మీరు నిన్న సూచనప్రాయంగా అయినా సభలో అని వుంటే, నే నీ తప్పు చేసివుండేదాన్ని కాదు. బహుశా, నాలాంటివాళ్ళల్లో వుండే సహజమైన అక్కసును బయటపడేలాచేసి, గర్వభంగం చేయాలని మీరు భావించి వుంటారు!" అన్నది.

ఆ మాటలకు లలితాచార్యుడు నవ్వి, "నాట్యం చేయడంలో నీకు, నిన్ను మించినవారు మరెవరూ లేరన్న అహం

కారం వున్నదనడంలో, ఎలాంటి అనుమానమూ లేదు. నీ నాట్యాన్ని గురించి సభలో, నా అభిప్రాయం చెప్పమనడంలో, నీ ఉద్దేశం ఏమిటో నా కర్థమైంది. శాస్త్రకారుడుగా పేరు ప్రఖ్యాతులున్న నా దగ్గిర నుంచి ప్రశంసలు పొంది, నాట్యకత్తెగా నీ కిదివరకే వున్న ఖ్యాతిని మరింతగా ఇనుమడింప చేసుకోవాలనుకున్నావు. అవునా ?'' అన్నాడు.

చూడామణి, లలితాచార్యుడికి నమస్కరిస్తూ, అవునన్నట్టు తలాడించింది.

''నేను సామాన్య ప్రేక్షకుల లాగా, నీ పాదాల ప్రతికదలికకూ తన్మయుణ్ణయిపోయి, చప్పట్లు చరచలేనుగదా! అందుక్కారణం, నాకు క్షుణ్ణంగా శాస్త్రం తెలిసివుండడం. నాట్యాచార్యుడిగా, నీ విద్య మరింత పరిపక్వత చెందే బాధ్యత కూడా తీసుకోవడం వల్లనే, నాట్యంలో నీకు అంతగా తెలియని మెలుకువలను గురించి ప్రస్తావించాను,'' అన్నాడు లలితాచార్యుడు.

''స్వామీ, అజ్ఞానంవల్ల, మీ సదభిప్రాయాన్ని నేను గుర్తించలేకపోయాను,'' అన్నది చూడామణి దీనంగా.

''చూడామణీ, నీది కేవలం అజ్ఞానం కాదు; తొందరపాటు. నాట్యంలోని అతి సున్నితమైన మెలుకువలు ఏవో, నువ్వు తప్ప ఆ సభలో మరెవరికీ తెలుసుకోవలసిన అవసరం లేదు. మహాసముద్రం లాంటి నాట్యశాస్త్రంలో, నీకు తెలియని స్వల్పవిషయాల గురించి నేను చెప్పటాన్ని గమనించి వుంటే, నాట్యవిద్యలో నీ కున్న ప్రజ్ఞను మెచ్చుకున్నాననేది స్పష్టమవుతున్నదిగదా? ఏ విధంగా పరిశీలించి చూసినా, సభలోని నా మాటలు నీ నాట్య ప్రశంసను సూచిస్తాయిగాని, నిరసనను కాదు,'' అన్నాడు లలితాచార్యుడు.

ఆ తరవాత చూడామణి కొన్నాళ్ళపాటు, లలితాచార్యుని వద్ద నాట్యవిద్యలో తనకు తెలియని అంశాలను అధ్యయనం చేసి, ఆయన దీవెనలందుకుని, తన దేశం తిరిగి వెళ్ళింది.





# కట్నాలపిచ్చి

కొడుకు వీరభద్రం పెళ్ళి ముహూర్తానికి బయలుదేరవలసిన సమయంలో, తాయారమ్మ ఒంట్లో బావుండలేదంటూ మంచం మీద ముణగడ తీసుకుని పడుకున్నది. వీరభద్రానికి ఏమి చేయాలో తోచింది కాదు. తల్లికి ఎటువంటి అస్వస్థతా లేదని అతడికి తెలుసు. ఆమెకు అత్తగారి లాంఛనాలు ముట్టబోవడం లేదన్న కోపం తీవ్రంగా వున్నది.

వీరభద్రం తల్లికి ఎంతగానో చెప్పి చూశాడు. అన్నిటికీ ఆమె, "నా ఒంట్లో బాగోలేదు. కోడలు అన్నాక, ఇంటికి రాకపోతుందా, నేను చూడకపోతానా," అంటూ మొండిగా జవాబులివ్వసాగింది.

తాయారమ్మకు వీరభద్రం ఒక్కగానొక్క కొడుకు. అతను మూడు సంవత్సరాలుగా మరొక ఊళ్ళో ఉద్యోగం చేస్తున్నాడు. అతను అద్దెకుంటున్న ఇంటి పక్కనే ఒక పేద కుటుంబం వుంటున్నది. చిన్నప్పుడే తల్లిని పోగొట్టుకున్న లలిత, తమ్ముళ్ళ ఆలనాపాలనా తానే చూస్తున్నది. తండ్రి సంపాదన బహు తక్కువ. ఆమె ఆ చాలీచాలని ఆదాయంతోనే గుట్టుగా సంసారం గడుపుకువస్తున్నది. ఆమె అందం చెప్పుకోదగినంతది కాకపోయినా, ఆమె శాంత గుణం, ఓర్పూ, ఇంటి పనుల్లో నేర్పూ, వీరభద్రాన్ని ఆకర్షించాయి.

లలిత వంటి భార్య దొరకడం అదృష్టం అనుకున్నాడు, వీరభద్రం. ఆమె అభిప్రాయం తెలుసుకున్నాకే, అతను తల్లిదండ్రులను వాళ్ళింటికి తీసుకుపోయాడు.

"పాతిక వేలు కట్నం యిచ్చే పక్షంలో, యీ పిల్లను కోడలుగా తెచ్చుకోవచ్చు," అన్నది తాయారమ్మ, తిరుగు ప్రయాణంలో బండి ఎక్కుతూ.

మాచిరాజు కామేశ్వరరావు



వీరభద్రం ఆశ్చర్యపోతూ, ''లలిత తండ్రి పాతిక రూపాయలు కూడా యిచ్చుకోలేడు,'' అన్నాడు.

తాయారమ్మ ముఖం కందగడ్డలా చేసుకుని, ''అయితే, ఈ దరిద్రగొట్టు సంబంధం మనకు వద్దనేవద్దు,'' అన్నది.

వీరభద్రం ముఖం చిన్నబుచ్చుకుని, ''డబ్బే ముఖ్యం కాదు. నేను పెళ్ళంటూ చేసుకుంటే లలితనే చేసుకుంటాను,'' అన్నాడు.

వీరభద్రం తండ్రి ఎటూ మాట్టాడలేక తటస్థంగా వుండిపోయాడు.

''వాళ్ళు కట్నం యివ్వలేని పక్షంలో, అత్తవారి లాంఛనాలకు ఐదు వేలు యివ్వాలి!'' అన్నది తాయారమ్మ పంతంగా.

''అమ్మా, ఈ లాంఛనాల సంగతి కూడా మర్చిపో. పెళ్ళి ఖర్చులకుగాను, నేనే లలిత తండ్రికి కొంత డబ్బు సర్ద బోతున్నాను,'' అన్నాడు వీరభద్రం.

తరవాత ఆమె ప్రమేయం లేకుండా పెళ్ళికి అన్ని ఏర్పాట్లూ జరిగిపోయినై. మర్నాడే పెళ్ళి!

ఆ సరికే బంధువులతో నాలుగు బళ్ళు కదిలి వెళ్ళిపోయాయి. తయారమ్మ ఆరోగ్యం బాగాలేదని వంకపెట్టి, తండ్రీ కొడుకులను వెళ్ళమంటున్నది:

''ఆ ఊళ్ళో వైద్యులకేం కొదవలేదు. నీ పెట్టె సర్ది బాబాయివాళ్ళ బండిలో పంపించేశాను.'' అంటూ వీరభద్రం తొందరపెట్టాడు.

వాళ్ళు లలితా వాళ్ళ ఊరు ఇవతల వున్న ఏటిని సమీపించేసరికి బాగా రాత్రి అయింది. ఆ సరికి మిగతా బళ్ళు ఏరు దాటి వెళ్ళిపోయాయి. వీరభద్రం వాళ్ళున్న బండి ఏటిని సమీపిస్తూండగా, ఏటిలోకి కొత్త నీరు రావడంతో బాగా పొంగివున్నది. వంతెన మీదుగా నీరు ప్రవహిస్తున్నది.

''ఏరు తీసేదాకా మనం, యీ ఒడ్డున వుండిపోవలసిందే.'' అన్నాడు బండివాడు.

మర్నాటి ఉదయానే పెళ్లి ముహూర్తం. వీరభద్రం దిగాలు పడిపోతూ, "ఏరు ఎప్పటికి తీసేట్టు?" అని బండివాణ్ణి అడిగాడు.

"చెప్పలేం. అర్ధరాత్రికే తీయవచ్చు, అలాకాక నాలుగైదు రోజులు పట్టినా పట్టవచ్చు." అన్నాడు బండివాడు.

ఆ మాటలు విన్న తాయారమ్మ బండిలో ఉత్సాహంగా లేచి కూర్చున్నది. అంతలో పెద్ద పెట్టున గాలి దుమారం ఆరంభమయింది. ఏటిగట్టుకు దగ్గిర్లో, కాస్త ఎడగా ఒక పెంకుటిల్లున్నది. బండివాడు బండిని, ఆ ఇంటి ముందుకు తీసుకుపోయాడు.

వీరభద్రం తలుపు తట్టగానే, ఒక నడి వయసువాడు తలుపు తెరిచి, "ఎవరు మీరు? ఏం కావాలి?" అని అడిగాడు.

వీరభద్రం అతడికి సంగతి చెప్పి, "బయట చీకటితోపాటు గాలిదుమారం కూడా లేచింది. ఏరు తీసేదాకా, కాస్త మీ ఇంట్లో తలదాచుకోదలిచాం," అన్నాడు.

"మాది లంకంత ఇల్లు. పెళ్ళి యీ ఇంట్లో చేసుకోదలుచుకున్నా, నా అభ్యంతరం లేదు," అని నవ్వుతూ ఇంటి అతను లోపలికి దారితీసి, పెద్దగా, "అమ్మా, రాగిణీ! మనింటికి అతిథులొచ్చారు." అంటూ కేకపెట్టాడు.



లోపలి గదుల్లో నుంచి రాగిణి అన్న అమ్మాయి అక్కడికొచ్చి, వీరభద్రం తల్లిదండ్రులకు నమస్కరించింది. ఆమెకు ఇరవై ఏళ్ళకన్న ఎక్కువ వయసుండదు; కళ్ళను మెరమెరలాడించే అందం.

తాయారమ్మ వద్దన్నా వినకుండా, ఆమె అప్పటికప్పుడు వంటచేసి, అందరికీ వడ్డించింది. ఒక పెద్ద గదిలో పరుపులు దులిపి పక్కలువేసి, "ఏమీ మొహమాట పడకండి. ఏ అవసరం వచ్చినా కేకవేయండి. పక్క గదిలోనే వుంటాను," అని చెప్పి వెళ్ళిపోయింది.

తాయారమ్మకు రాగిణిని చూస్తూనే మనసులో కొత్త ఆలోచనలు బయలు



దేరినై. అందమైన పిల్ల! ఇంటాయనకు ఒక్కగానొక్క కూతురులా వుంది. లాంఛనాల మాట అలా వుంచి, యీ పిల్లను చేసుకుంటే, అందగత్తె అయిన కోడలితో పాటు, ఏటి ఒడ్డున వున్న బహు ముచ్చటైన ఇల్లు కూడా తమదవుతుంది!

''ఏరు మనమంచికే పొంగినట్టున్నది!'' అన్నది తాయారమ్మ ఉత్సాహంగా.

''అదేం మాట! ఏరు త్వరగా తీస్తే, మనం తెల్లవారి ముహూర్తం వేళకు ఆ ఊరు చేరుకోవచ్చు,'' అన్నాడు వీరభద్రం.

''ఆ ముహూర్తానికే రాగిణి మెళ్లో మూడు ముడులూ వేస్తే సరిపోతుంది,'' అన్నది తాయారమ్మ.

వీరభద్రం ఉలిక్కిపడి, ''నీకేమన్నా మతిపోయిందా, అమ్మా!'' అన్నాడు కోపంగా.

తాయారమ్మ తనూ కోపం తెచ్చుకుని, ''ఈ అమ్మాయికి అందం వుంది, వచ్చిన వాళ్ళను ఆదరించడం తెలుసు. ఏదో కొంత కట్నం ముట్టజెప్పగల వాళ్ళలాగే కనబడుతున్నారు,'' అన్నది.

''పెళ్ళంటే కట్నం వసూలు చెయ్యడమేనా? నాన్నకు, తాతయ్య ఎంత కట్నం యిచ్చాడో విన్నాలే,'' అన్నాడు వీరభద్రం.

వీరభద్రం తండ్రి తల పక్కకు తిప్పుకుని చిన్నగా నవ్వుకున్నాడు. తాయారమ్మ గతుక్కుమని, ''అయినా, ఆ రోజులు వేరు! తెల్లవారగానే నేను, రాగిణి తండ్రితో మాట్లాడి, ఈ పెళ్ళికి ఒప్పిస్తాను. కాదూ, ఆ పొంగుతున్న ఏట్లో హరీ అంటాను,'' అన్నది.

ఈ కొత్త సమస్యకు పరిష్కార మార్గమేమిటో వీరభద్రానికి అర్థం కాలేదు. అతడు ఆలోచిస్తూ నిద్రలోకి జారుకున్నాడు. తిరిగి అతడికి మెలుకువ వచ్చేసరికి తెల్లవారుతున్నది. కిటికీలోంచి ఏటి నీరు తీసిన సూచనగా వంతెన స్పష్టంగా కనబడుతున్నది.

అప్పటికే నిద్ర లేచిన తాయారమ్మ, వీరభద్రంతో, ''ఇక ప్రయాణం అవుదా

మనుకుంటున్నావేమో, అదేం కుదరదు. నీ పెళ్ళి రాగిణితో జరగవలసిందే!'' అంటూ, రాగిణిని కేకవేస్తూ, లోపలి గదుల్లోకి వెళ్ళింది.

తరవాత ఒకటి, రెండు నిమిషాలు జరక్కుండానే, తాయారమ్మ పెట్టిన కేక విని వీరభద్రం, తండ్రీ అక్కడికి పరిగెత్తారు. ఇల్లంతా నిశ్శబ్దంగా వున్నది. ఇంటి పెరటివైపు తలుపులు బార్లా తెరిచి వున్నవి. తాము వెంట తెచ్చిన పెట్టె పెట్టిన చోటు ఖాళీగా వున్నది. వణుకుతున్న తాయారమ్మ చేతిలో ఒక కాయితం ముక్క వున్నది. వీరభద్రం దాన్ని తీసుకుని చదివాడు. అందులో యిలా వున్నది:

ఈ ఇల్లు మాది కాదు. ఇంటి వాళ్ళు యాత్రకు వెళ్ళారని తెలిసి, మారుతాళం చెవులతో ఇంట ప్రవేశించాం. ఎక్కడా ఒక్క విలువైన వస్తువు లేదు. పెళ్ళికి వెళుతున్న మీ పెట్టెలో విలువైన వస్తు సామగ్రి వుంటుందని, మాకు తెలుసు. దాని తాళం బద్దలుకొట్టి, మీకు నిద్రా భంగం కలిగించడం ఎందుకని, అలాగే ఎత్తుకు పోతున్నాం. ఏరు మా మంచికే పొంగినట్టున్నది!

కళ్ళనీళ్ళతో దిక్కులు చూస్తున్న తల్లితో వీరభద్రం, ''అమ్మా, దిగులు పడకు. నీ నగలూ, వడ్డాణం అన్నీ, బాబాయి వాళ్ళ బండిలో పంపాను. నువ్వు కావాలనుకున్న యీ అందమైన కోడలు, అత్తవారింటికి వచ్చిన మర్నాడే, ఇల్లంతా దోచుకుని పారిపోయి వుండేది,'' అన్నాడు.

తన నగలూ, విలువైన చీరలూ పోనందుకు తాయారమ్మ సంతోషిస్తూ, ''పెద్ద గండమే తప్పింది. దీనితో నా కట్నాల పిచ్చి కుదిరిపోయినట్టే! పదండి. ముహూర్తం వేళ అవుతున్నది. కాబోయే కోడలికి, నా నగలన్నీ పెట్టి, అలంకరించాలి,'' అన్నది.

తల్లిలో వచ్చిన మార్పుకు వీరభద్రంతో పాటు, అతడి తండ్రి కూడా చాలా సంతోషించాడు.





# రాజుగారి ప్రాపకం

పుష్పగిరి నగరంలో ధనంజయ్య, గోపయ్య అనే యిద్దరు వ్యాపారులు, రాజ వీధిలో దుకాణాలు పెట్టుకుని, సుగంధ ద్రవ్యాల వ్యాపారం చేస్తూండేవాళ్ళు.

ఒకనాడు రాజభటు డొకడు ధనంజయ్య దగ్గిరకు వచ్చి, ''మిమ్మల్ని రాజుగారు సాయంత్రం తన ప్రత్యేక మందిరానికి వచ్చి కలుసుకోమన్నారు,'' అని చెప్పి వెళ్ళిపోయాడు.

సాయంత్రం అవుతూనే ధనంజయ్య రాజుగారి దగ్గిరకు వెళ్ళి, కొంతసేపటికి దుకాణానికి తిరిగి వచ్చాడు.

భటుడిద్వారా రాజుగారి నుంచి పిలుపు రావడం, ధనంజయ్య రాజభవనానికి వెళ్ళిరావడం గమనించిన గోపయ్య, ధనంజయ్య వద్దకు వెళ్ళి, ''నిన్ను రాజుగారు పిలిపించారుగద, కారణం ఏమిటి?'' అని అడిగాడు.

''నాకూ, రాజుగారికీ మధ్య ఎన్నో రహస్యాలుంటాయి. అవన్నీ నీకు చెప్పాలా?'' అంటూ ధనంజయ్య, గోపయ్యను గట్టిగా కసురుకుని పంపేశాడు.

ఆ తర్వాత కూడా ధనంజయ్య వద్దకు వారానికొకసారి రాజభటుడు రావడం, ధనంజయ్య సాయంత్రంవేళ రాజభవనానికి వెళ్ళి వస్తూండడం గోపయ్య గమనిస్తూనే వున్నాడు.

రాజుగారి దగ్గిరకు ధనంజయ్య ఎందుకు వెళుతున్నాడో ఎంత ఆలోచించినా గోపయ్యకు అంతుబట్టలేదు. ఒకనాడు అతడు భార్యకు సంగతి చెప్పి, ''ఎంత బుర్ర బద్దలు కొట్టుకున్నా, నాకు దీని వెనక వున్న రహస్యమేమిటో అర్థం కావడంలేదు. నువ్వు కూడా కాస్త ఆలోచించి చూడు!'' అన్నాడు.

దానికి గోపయ్య భార్య, భర్త కేసి వింతగా చూస్తూ, "ఈ మాత్రానికి పెద్దగా ఆలోచించడం కూడానా! ఆ ధనంజయ్య వారానికొకసారి రాజుగారి దగ్గిరకు వెళ్ళి వస్తున్నాడంటే, ఆయనకు రాజుగారి ప్రాపకం వున్నదన్నమాట," అన్నది.

గోపయ్యకు అంతే అయివుంటుందన్న నమ్మకం కలిగింది. అతడు భార్య తెలివి తేటల్ని తెగమెచ్చుకున్నాడు.

"మీరు, నన్ను మెచ్చుకోవడంవల్ల ఒరిగేదేమీ వుండదు. రాజుగారి ప్రాపకం గల ధనంజయ్యను మంచి చేసుకోండి. మనకు ముందు, ముందు లాభం కలుగుతుంది," అన్నది గోపయ్య భార్య.

ఆ మర్నాడు గోపయ్య, భార్యచేత మిఠాయిలు చేయించి, బజారులో పది రూపాయిలు పెట్టి పళ్ళు కొని, వాటిని బుట్టలో పెట్టుకుని, ధనంజయ్య ఇంటికి వెళ్ళాడు.

ఏనాడూ తన ఇంటికి రాని గోపయ్య, పళ్ళూ, మిఠాయిలతో రావడం చూసి, ధనంజయ్య ఆశ్చర్యపోతూ, "ఏమిటిలా వచ్చావు? ఇవన్నీ ఎందుకు?" అని అడిగాడు.

"మీ ఇంటికి రావాలని చాలా రోజులుగా అనుకుంటున్నాను; ఇవాళ తీరిక చిక్కింది. ఈ పళ్ళూ, మిఠాయిలూ



పిల్లలకోసం. ఈ మాత్రం ఖర్చు భరించలేని బీదవాణ్ణికాదుగదా!" అన్నాడు గోపయ్య.

ఆ తర్వాత అతడు ధనంజయ్యతో, ఆ మాటా, యీ మాటా మాట్లాడి ఇంటికి వచ్చేశాడు. ఆ రోజునుంచీ గోపయ్య ధనంజయ్య యింటికి తరచూ వెళుతూ, ఏ పళ్ళో, మిఠాయిలో పిల్లలకు యిచ్చి వస్తూండేవాడు.

కొన్నాళ్ళు జరిగాక, పన్నులు వసూలు చేసే రాజుగారి ఆస్థానోద్యోగి నుంచి గోపయ్యకు వృత్తిపన్ను కింద నూరు మొహరీలు కట్టవలసిందిగా కబురు వచ్చింది.

ఆ మర్నాడు గోపయ్య దుకాణానికి బయలుదేరుతూ, "నేను సాయంత్రం పన్నులు వసూలు చేసే అధికారి దగ్గిరకు పోయి, పన్ను కట్టి రావాలి. బహుశా, ఇంటికి తిరిగిరావడం కాస్త ఆలస్యం అవుతుంది," అన్నాడు భార్యతో.

భార్య ఆశ్చర్యంగా "మీరు రాజు గారికి పన్ను కట్టడమేమిటి ?" అన్నది.

భార్య ప్రశ్న అర్థంకాక గోపయ్య విసుక్కుంటూ, "ఆ చెప్పేదేదో, తెలిసేట్టు సరిగ్గా చెప్పరాదా ?" అన్నాడు.

"మీకు, సాటి వ్యాపారస్థుడైన ధనంజయ్య స్నేహితుడు. ఆయనకు రాజుగారి ప్రాపకం వున్నది. అలాంటప్పుడు, మీరు పన్ను కట్టకపోతే, ఆ అధికారి ఏం చేయగలడు ? రాజుగారు, మీ మీద ఎలాంటి చర్యా తీసుకోడు," అన్నది గోపయ్య భార్య.

గోపయ్యకు భార్య మాటలు బాగా నచ్చినై. అతడు పన్ను కట్టకుండా వూరుకున్నాడు. వారం తరవాత గోపయ్య దగ్గిరకు ఒక రాజభటుడు వచ్చి, "మిమ్మల్ని రాజుగారు, సాయంత్రం తన ప్రత్యేక మందిరానికి వచ్చి కలుసుకోమన్నారు," అని చెప్పి వెళ్ళిపోయాడు.

ధనంజయ్య కారణంగా, తనకూ రాజుగారి ఆదరణ దొరకనున్నదని సంతోషిస్తూ, ఆ సాయంత్రం గోపయ్య రాజుగారి ప్రత్యేక మందిరానికి వెళ్ళాడు.

రాజు అతణ్ణి చూస్తూనే, "నిన్ను, నేనెందుకు పిలిపించానో తెలుసా ? ఈ మందిరం అంతా నీ చేత ఊడ్పించడానికి. గత వారం వరకూ, యీ పని ధనంజయ్య అనే వ్యాపారి చేస్తూండేవాడు. ఈ వారం నుంచీ ఆ పని నువ్వు చేయాలి. ఈ సంగతి నీకు గుర్తు చెయ్యడానికి వారం, వారం భటుడొకడు నీ దగ్గిరకు వస్తూంటాడు. పన్నులు ఎగవెయ్యాలని చూసే, మీబోటి వ్యాపారులకు యిదే తగిన శిక్ష !" అన్నాడు.

ఆ రోజు నుంచీ రాజుగారి మందిరం ఊడ్చే పని గోపయ్య నెత్తిన పడింది.





# విఘ్నేశ్వరుడు

సాలలో యింత గొడవ జరుగుతున్నా, పాలేరు ఇంకా నిద్రిస్తూనే ఉన్నాడు. పక్కనే పత్రిపూలతో నిండిన గణేశ విగ్రహం ఉంది. నేలంతా చెరుకుపానకంతో బురద, బురదగా తడిసి ఉంది. కాపలావాళ్ళను పిలిపించి అడిగితే వాళ్ళు, "చాలా రాత్రయింది, పాలేరు నిశ్చింతగా నిద్ర తీస్తున్నాడు, మాకూ కునుకొచ్చింది. అంతలో ఏనుగు అరుపుతో కళ్ళు తెరిచాము. పెద్ద ఏనుగు చీకట్లో తెల్లగా కనిపించింది. చెరుకంతా లాగి మేసేస్తున్నది, గానుగలాగ పిప్పంతా ఊసేస్తున్నది; మాకు చెడ్డభయమేసింది. పారిపోయాం!" అంటూ వాళ్ళింకా భయంతో వొణికిపోతూనే చెప్పారు.

భూస్వామిలో గొప్ప పరివర్తనం కలిగింది. అలాగే వెళ్ళి పాలేరు పాదాలకు మ్రొక్కుతూన్నట్లు సాగిలపడిపోయాడు. పాలేరు మేల్కొన్నాడు, లేచి నుంచున్నాడు. భూస్వామి అతని పాదాలు వదలకుండా శిరస్సుతో మ్రొక్కుతూనే ఉన్నాడు.

భూస్వామి భార్య విఘ్నేశ్వర విగ్రహానికి ప్రణమిల్లి, "స్వామీ! ఇన్నాళ్ళకు మమ్మల్ని అనుగ్రహించావు, ధన్యులం!" అని అంటూ జరిగిందంతా పాలేరుక చెప్పింది.

మహాద్భుతాన్ని విన్న జనం తండోపతండాలుగా అక్కడికి చేరుకుంటున్నారు. దివాణం క్రిక్కిరిసిపోయింది. నేలపై

23. విచిత్ర వినాయకీయం




ఏనుగు పాదాల గుంటల్లో నిలిచి ఉన్న చెరుకురసాన్ని తీర్థంగా సేవిస్తూ, చెరుకు పిప్పిని విఘ్నేశ్వర మహాప్రసాదంగా పట్టుకువెళ్తున్నారు.

పాలేరు, భార్య పిల్లవాడితో కలిసి వినాయక విగ్రహానికి దణ్ణాలు పెడుతూ, "చిన్న పత్రిపిసరైనా వేసి నిన్నెన్నడూ పూజించలేదు. నీ కోసమని పంపిన చెరుకు నీకు పెట్టనైనాలేదు. నా కోసం ఎందుకింత శ్రమపడ్డావయ్యా? ఏనుగు రూపంతోనైనా అందరికీ కనిపించావు, నాకు కనిపించావు కావు. నిద్దరపోయిన దద్దమ్మను!" అంటూ పిల్లవాడిలాగ బావురుమన్నాడు.

అప్పుడు విగ్రహం స్థానంలో చెరుకుగడ పట్టుకొని విఘ్నేశ్వరుడు పాలేరు ముందు సాక్షాత్కరించాడు. పాలేరు కొడుకు తీసుకువెళ్ళిన చెరుకుగడే అతని చేతిలో ఉంది!

విఘ్నేశ్వరుడు పాలేరును తన తొండంతో దగ్గిరకు తీసుకొని, అభయహస్తంతో అతని తల నిమురుతూ, "నాయనా! కులాలు, జాతులు ఆచారాలు నేను పెట్టినవి కావు, అంతా మనుషులు కల్పించుకున్నవే. నా దగ్గిర ఎక్కువ తక్కువలకు చోటు లేదు! అందుకే నీకు కనిపించాను!" అని చెప్పి అంతర్ధానమయ్యాడు.

జనులందరూ చేతులెత్తి జోడిస్తూ పాలేరుతో, "నీ మూలంగా మాకు గణేశుని దర్శన భాగ్యం కలిగింది," అంటూ పదేపదే మొక్కుతూ బ్రహ్మరథం పట్టారు.

"ఇక్షు అంటే చెరుకు, సహస్ర-ఇక్షు, వెయ్యి చెరుకుల గణపతి; సహస్రేక్షు గణపతిగా విఘ్నేశ్వరుడు కీర్తింపబడ్డాడు. చెరుకుగడ పట్టుకొన్న వినాయక విగ్రహం ప్రతిష్ఠింపబడి అక్కడ గొప్ప ఆలయం వెలిసింది," అని పావనమిశ్రుడు కథ ముగించాడు.

ఆలయమంటపంలోని చిత్రాల కథలన్నీ పావనమిశ్రుడు చెప్పాడు గాని

ముఖద్వారం మీద చిత్రింపబడినది మాత్రం మిగిలి ఉంది. అది చాలా పెద్ద చిత్తరువు. మంటపంలోని చిత్రాలన్నీ ఒక ఎత్తు అది ఒక్కటీ ఒక ఎత్తు! చిత్రలేఖన ప్రతిభ అంతా అందులో ఉంది. ప్రతి రోజూ ఆ చిత్రాన్ని పరీక్షగా నిల్చుని చాలా సేపు తదేకంగా చూస్తూండే యువకుడొకడు పావనమిశ్రుడి పాదాలకు నమస్కరించి, "మహాశయా! ఈ ఆలయ మంటపంలోని చిత్రాలను ఎవరు చిత్రించారు? ఆ మహాశిల్పి చరిత్ర ఏమైనా ఉంటే చెప్పండి! ఆ ముఖద్వారం మీద వున్న చిత్రానికి నా కళ్ళూ, మనస్సూ అంకితమైపోయాయి. ఆ చిత్తరువు గురించిన గాథ కూడా చెప్పి చిత్ర చరిత్ర సంపూర్ణం చెయ్యండి!" అన్నాడు.



పావనమిశ్రుడు ఆ యువకుణ్ణి సాదరంగా చూసి, "నాయనా! చూడగా నువ్వూ చిత్రకారుడిలాగ కనిపిస్తున్నావు! ముఖద్వారం మీది చిత్తరువు నాకూ అభిమాన చిత్రమే. దాని గాథ తర్వాత చెప్పి విఘ్నేశ్వర చరిత్ర సంపూర్ణం చేస్తాను! నువ్వడిగిన చిత్రశిల్పికి చరిత్ర లేకపోలేదు, ఉంది!" అంటూ కన్నులు మూసి ఏదో గుర్తు తెచ్చుకుంటున్నట్లు ధ్యానించి, కాస్సేపైనాక చెప్పడం ప్రారంభించాడు:

వాతాపి నగరానికి సాధువుల గుంపుతో పథ్నాలుగేళ్ళప్రాయంగల వాడొకడు వచ్చి వాతాపి గణపతి ఆలయం వదలకుండా అలాగే ఉండిపోయాడు.

అతని ఊరేదో పేరేదో అతనికే తెలియదు. అతని నుదుట పెద్ద గాయం మానిన గుర్తు చూసి, పాపం ఏదో దెబ్బ తగిలి స్మృతి పోగొట్టుకొన్నవాడులాగుంది, అని అంతా అనుకున్నారు. ఆ బాలుడు మూగవాడా అన్నట్లు అట్టే మాట్లాడేవాడు కాడు. గోడల మీద బొమ్మలు గీస్తుండేవాడు. మంటపం రాతిపలకల నేలమీద సుద్దతో బొమ్మలు గీస్తూండేవాడు. గీస్తూన్నంతసేపూ అతని ముఖం పూర్ణచంద్ర



బింబంలాగ నవ్వుతూ వెలుగుతూండేది. అంచేత చిత్రానందుడు, చిత్రముఖుడు అనీ, అతడు ఎక్కువగా విఘ్నేశ్వరుడి బొమ్మల్నే వేస్తూండడంవల్ల విఘ్నేశ్వర చిత్రకారుడు అనే పేరును లుప్తాక్షరిగా విచిత్రుడు అని అంటూండేవారు.

అప్పటికి గజాననపండితుడు చాలా వృద్ధుడయ్యాడు. రోజూ సాయంత్రం ఇంటి దగ్గిర పిల్లలకు విఘ్నేశ్వరుడి కథలు చెప్పుతూండేవాడు. విచిత్రుడు ఆ కథలను అతిశ్రద్ధగా అరుగు మీద చెవికోసుకొని వింటూండేవాడు. కథ విన్న మర్నాడు ఆ కథకు సంబంధించిన చిత్రం ఏ గోడ మీదనో కనిపించేది.

గజానన పండితుడికి విచిత్రుడి మీద చాలా వాత్సల్యం. ఇంటిలోపలికి పిల్చినా విచిత్రుడు గడపమీద ద్వారం వెలుపలే కూర్చుని వింటూ, "స్వామీ, ఇక్కడ కూచుని వింటేనే నాకొక్కడికే చెబుతున్నట్లు ఎంతో బాగా వినిపిస్తున్నది!" అనేవాడు. విచిత్రుడు చిత్రించే విఘ్నేశ్వరుడి బొమ్మలు చూసి గజాననుడు మురిసిపోతూ, విఘ్నేశ్వరుడికి సంబంధించిన అనేక కథలను ప్రత్యేకంగా అతనికి చెబుతూండేవాడు.

విచిత్రుడి వెనక ఎప్పుడూ పిల్లలు గుంపులుగా ఉండేవారు. అతను బొమ్మలు వేస్తూంటే నిశ్శబ్దంగా చూసి ఆనందిస్తూ, తర్వాత చిన్న చిన్న బొమ్మలు వేస్తూండేవారు. ఊళ్లో పిల్లలకి చిత్రకళ అబ్బింది.

విచిత్రుడు పగలంతా వీధుల్లో గోడల మీద జేగురుముక్కతోనో, సుద్దరాయితోనో బొమ్మలు వేస్తూ, వాతాపి గణపతి ఆలయంలో పంచే ప్రసాదంతో గడిపి, రాత్రి ఆలయమంటపం మెట్లమీద ఓ వారగానో, ఊరి చివరనున్న వాడలో ఏ పంచకిందనో నిద్రపోయేవాడు.

ఆ వాడలో కుమ్మరులు, చర్మకారులు, పంచములు మొదలైనవారుండేవారు. విచిత్రుడంటే ప్రాణం పెట్టేవారు. ఏ అపరాత్రివేళ విచిత్రుడు వచ్చినా అతని

కోసం ఉంచినదాన్ని పెట్టి తినిపించి మరీ విచిత్రుడికి పడక సదుపాయం చేసి నిదురపోయేవాళ్ళు.

ఆ విధంగా విచిత్రుడు పెరిగి పెద్ద వాడయ్యాడు.

తానెవరో తనకే తెలియకుండా మరిచి పోయిన విచిత్రుడికి అన్నలూ తల్లీ తండ్రీ అందరూ ఉన్నారు!

వాతాపి నగరానికి కొంత దూరంలో ఉన్న ఒక ఊళ్లో మధ్యతరగతి కుటుంబంలో విచిత్రుడు పుట్టాడు. తండ్రి మూలంగా అతనికి అతి బాల్యంలోనే బొమ్మలు గీయడం అబ్బింది. బొమ్మలు వెయ్యడానికే పుట్టాడా అన్నట్లు ఆ కుర్రవాడికి మరేదీ అబ్బలేదు. అన్నలు, వదినలు అతణ్ణి యీసడించుకొని ఇంటినుండి తరిమేశారు. కుర్రవాడికి విఘ్నేశ్వరుడంటే చాలా యిష్టం. వాతాపి నగరానికి బయలుదేరివస్తూ, తిండీతిప్పలు లేని నీరసంతో మార్గంలో ఒక కరుకురాతి మీద పడిపోయాడు. దెబ్బ తగిలి తెలివితప్పి పడి ఉన్న అతణ్ణి సాధువుల గుంపు కాపాడి వాతాపి నగరానికి తెచ్చారు. అదీ విచిత్రుడి బాల్యచరిత్ర.

ఆ ఏడాది వాతాపి నగరంలో వినాయక చతుర్థి. ఉత్సవాలకు ఒక ప్రదర్శన ఏర్పాటు జరిగింది.



నిలువెత్తు వినాయక విగ్రహాలను చిత్రకళా ప్రతిభ కనపరుస్తూ రంగులు వేసి ప్రదర్శనలో పెట్టాలి. అన్నిట్లో గొప్పగా ఉన్న విగ్రహాన్ని వెయ్యి బంగారు కాసులకు నవరాత్రి ఉత్సవాలు నిర్వహించేవారు కొంటారు. రత్నఖచిత స్వర్ణకంకణాన్ని నగరపాలకులు చిత్రకారుడికి బహూకరిస్తారు.

ఆ పోటీ ప్రదర్శనకు ఆస్థాన చిత్రకారులూ, గొప్ప గొప్ప చిత్రకళా నిపుణులూ చాలా మూల్యాన్ని వెచ్చించి దేశాంతరాల నుండి తెప్పించిన రంగులు, బంగారు పూతలు, రంగురంగుల మెరుపు రేకులు, రంగురాళ్ల పొళ్ళు ఉపయోగించి,



మెరుగుపూత పెట్టిన విగ్రహాలను ప్రదర్శనలో పెట్టారు.

విచిత్రుడికి ఒక కుమ్మరి మిత్రుడున్నాడు. విచిత్రుడు దగ్గిరుండి చెప్పిన విధంగా అతడు బంకమట్టితో విఘ్నేశ్వర విగ్రహాన్ని చేశాడు. విచిత్రుడు సున్నము, మసి, జేగురు, పచ్చమట్టి, ఆకుపసర్లను ఉపయోగించి విగ్రహానికి రంగులు దిద్దాడు.

విచిత్రుడు రంగులు వేసిన ఆ విగ్రహాన్ని చిత్రకార ప్రముఖులు ప్రదర్శనలో పెట్టనివ్వలేదు. విచిత్రుడు ప్రదర్శన నిర్వాహకులతో, "అయ్యా! దయతో చిట్ట చివర్న నా విగ్రహాన్ని కూడా ఉంచండయ్యా! ఉడతాభక్తిగా నేను కూడా నాకు వచ్చినంతగా విఘ్నేశ్వరుడికి రంగులు వేశానని అనుకుంటూ, ఆ గొప్ప గొప్ప విఘ్నేశ్వరుల సరసన నా విఘ్నేశ్వరుడు కూడా ఉంటే చూసుకోవాలని ఉందయ్యా! అంతకు తప్ప మరే కోరికా లేదు!" అని ప్రాధేయపడ్డాడు.

కాని, "కులగోత్రాలు, ఊరూ పేరూ లేనివాడివి, కడజాతులతో తిరిగేవాడివి. అలాంటి నీ చేతుల్లో తయారైన విగ్రహానికి వంశప్రతిష్ఠలుగల ప్రఖ్యాత మహా చిత్రకారుల విగ్రహాల సరసన ప్రదర్శించడానికి అర్హత లేదు!" అని నొక్కి వక్కాణించారు ప్రదర్శన నిర్వాహకులు. విచిత్రుడు చాలా విచారపడ్డాడు.

కుమ్మరి మిత్రుడు, "ప్రదర్శన పందిట్లో పెట్టకపోతే పోయారు. మనం విగ్రహాన్ని వేరేచోట పెడదాం పద!" అని విచిత్రుడికి నచ్చజెప్పి, ప్రదర్శన శాలకు దగ్గర్లో ఉన్న ఒక అరటిచెట్టు మొదట విగ్రహాన్ని పెట్టి, విచిత్రుణ్ణి తనతో బాటు అక్కడ కూర్చుండబెట్టుకున్నాడు.

ప్రదర్శనశాలలో పెద్దవాళ్ళు విగ్రహాలను చూస్తూ, గుంపులు గుంపులుగా చేరి, విగ్రహాలకు ఉపయోగింపబడిన రంగుల విలువల గురించీ, చిత్రకారుల పదవీ కులగోత్రాల గొప్పలూ చెప్పుకుంటూ

ఉంటే, పిల్లలంతా విచిత్రుడి వినాయక విగ్రహం దగ్గిరికి చేరి హర్షధ్వానాలు చేస్తూ ఆసక్తితో చూస్తున్నారు.

ఆ సమయంలో ఆకాశంనుండి జారి పడ్డ జంటమెరుపుల్లాగ ఉన్న ఇద్దరు తరుణులు, ప్రదర్శనశాలకు వచ్చారు. వారు నిండుగా ధరించిన రత్నాభరణాల కాంతి మిరుమిట్లు గొల్పుతున్నది.

జనం వారిని చూసి విస్తుబోతూంటే, పెద్దామె, ''కళానంద నగరం మాది. మాకు నచ్చిన వినాయక విగ్రహం కోసం పదివేల వరహాలు పట్టుకు తిరుగు తున్నాం!'' అంటూ చేతనున్న బంగారు జలతారు అల్లిక సంచిని గలగల్లా డించింది. అక్కడ ఉన్న చిత్రకారులు చరచరా వారి వారి విగ్రహాల దగ్గిరికి వెళ్ళి నిల్చున్నారు.

''మా అక్క ప్రసన్నవదన గొప్ప గాయనీమణి. అంతేకాదు, గొప్ప తిండి పోతు. నైవేద్యపుష్టి, విగ్రహపుష్టి తర్వాతనే గాత్రపుష్టి. బొజ్జ పెంచి పాడి చూడు, అనే గాయక సిద్ధాంతాలకు తార్కాణం మా అక్క ప్రసన్నవదన!'' అంటూ సుకుమారంగా సమ్మోహనాస్త్రం లాగున్న చిన్నామె కాలిమువ్వలు ఘల్లు మనిపించింది.

''మా చెల్లి మోహన గొప్ప వాగుడు కాయ, అంతకంటె గొప్ప నర్తకీమణి! చూడ్డానికి చిన్నారి చిట్టిలాగుండే కాని, నన్నే ఎత్తి తిప్పేస్తుంది! అంత శక్తి సామర్థ్యాలున్నాయి దానికి. నృత్యంలో దాని చురుకుదనం చూడ శక్యంకాదు!'' అని ప్రసన్నవదన చెప్పింది.

''మా చేత పాడించడం, ఆడించడం, ఆ ఇంద్రుడికీ, కుబేరుడికీ సాధ్యం కాదు. అలాంటి ఆటపాటల్ని, మాకు కావలసిన విగ్రహం ముందు జరుపుతామని మొక్కు కున్నాం!'' అని మోహన చెప్పింది.

వారి మాటలకు పరవశించిపోతూన్న జనం మంత్రించినట్లుగా పక్కకు తప్పు కుని విశాలంగా దారి చేశారు.

—(వచ్చే సంచికలో ముగింపు)





# తారుమారైన తీర్పులు

పూర్వం సింహళ దేశంలో ఒక వర్తకు డుండేవాడు. ఆయన సముద్ర వర్తకం చేసి చాలా లక్షలు గడించాడు. ఆయన వృద్ధుడై చనిపోయే సమయంలో తన కొడుకైన జయపాలుణ్ణి పిలిచి, అతనికి తన వ్యాపారం అప్పగించి, "నాయనా, నువు కూడా నా లాగే సముద్రవ్యాపారం చెయ్యి. కాని పొరపాటున కూడా వంచక మహాపట్టణానికి వెళ్ళకు," అని సలహా యిచ్చాడు.

తండ్రి పోయాక జయపాలుడు తన నాలుగు నౌకలనూ తీసుకుని వ్యాపారం చేయసాగాడు. వంచక మహాపట్టణానికి పోతే ఏమి జరుగుతుందో తెలుసుకోవాలని అతనికి కుతూహలం పుట్టింది. అతను తెలివిగలవాడు; అందుచేత, ఎవరైనా తనను మోసం చేసినా తాను ఎత్తుకు పై ఎత్తు వేయగలనన్న ధైర్యం అతని కున్నది. కనుక అతను తన నాలుగు నౌకలనూ నడిపించుకుని ఆ పట్టణానికి వెళ్ళాడు. అది సూర్యోదయం వేళ. నౌకలను రేవులో ఉంచి జయపాలుడు తన విల్లూ, బాణాలూ వెంట పెట్టుకుని తీరం వెంబడి వేట షికారుకు బయలుదేరాడు. ఒకచోట అతని కొక నీటికొంగ కనబడింది. అది సముద్రంలోని చేపలను వేటాడుతున్నది. జయపాలుడు తన విల్లు ఎక్కు పెట్టి గురి చూసి, ఆ కొంగను కొట్టాడు. ఒక్క బాణంతో ఆ కొంగ చచ్చి సముద్రపు నీటిలో పడిపోయింది.

ఆ సమీపంలో చేపలను పట్టుతూ ఉన్న పల్లెవాడొకడు ఇది చూసి, జయపాలుడి దగ్గిరికి పరిగెత్తుకుంటూ వచ్చి, "ఎవరయ్యా, నువూ? నా తండ్రిని చంపావు. నీ మీద రాజుగారితో ఫిర్యాదు చేస్తాను, చూస్తూ ఉండు!" అన్నాడు.

25 ఏళ్ళనాటి. చందమామ కథ



''ఆ కొంగ నీ తండ్రా?'' అని జయపాలుడు ఆశ్చర్యంతో అడిగాడు.

''అవును. కిందటి జన్మలో నా తండ్రి. ఇప్పుడు నీటికొంగ జన్మ ఎత్తి నాకు చేపల వేటలో సహాయపడుతున్నాడు!'' అన్నాడు పల్లెవాడు.

జయపాలుడికి కోపం వచ్చింది. ''పో, దిక్కున్న చోట చెప్పుకో!'' అని చేపలు పట్టేవాణ్ణి గదమాయించాడు.

తరవాత అతను నగరం ప్రవేశించి నడుస్తూ ఉండగా, ఒక మనిషి ఎదురై, ''ఎన్నాళ్ళకు కనబడ్డావు, బాబూ! చాలా కాలం క్రితం నేను నా కుడిచెవి మీ తండ్రిగారి వద్ద తాకట్టు పెట్టి, పది రూపాయలు తీసుకున్నాను. ఆ బాకీ చెల్లిస్తాను. నా చెవి నాకు ఇప్పించు,'' అన్నాడు.

జయపాలుడు నిర్ఘాంతపోయి, ఆ మనిషికేసి చూశాడు. అతనికి ఎడమ చెవి మాత్రమే ఉన్నది; కుడి చెవి లేదు. ''మా నాన్నగారు నీ చెవి గురించి నాకేమీ చెప్పలేదే!'' అన్నాడతను ఆ మనిషితో.

''నా చెవి నా కిప్పించకపోతే నేను నీ పైన ఫిర్యాదు చేస్తాను చూసుకో!'' అంటూ ఆ మనిషి వెళ్ళిపోయాడు.

జయపాలుడు మరికొంత దూరం వెళ్ళే సరికి ఒక స్త్రీ ఎదురై, ''చూడు, నాయనా! పదహారేళ్ళ క్రితం మీ నాన్నగారు ఈ ఊరు వచ్చి నన్ను పెళ్ళాడి, తన దారిన తాను వెళ్ళిపోయారు. నాకు మనోవర్తి కింద పదివేల రూపాయ లిస్తానని ఆయన మాట ఇచ్చారు. ఆ డబ్బు నువ్వు ఇస్తావా, లేక ఫిర్యాదు చేయమన్నావా?'' అని అడిగింది.

జయపాలుడు ఈ దుర్మార్గాన్ని సహించలేక ''పో, నేను నీకు దమ్మిడీ కూడా ఇవ్వను!'' అని తన నౌకల వద్దకు తిరిగి వెళ్ళాడు. అక్కడ రేవులో అతనికి ఒక మంగలి కనిపించి, ''క్షౌరం చెయ్యమంటారా, బాబూ?'' అన్నాడు.

''ఏం తీసుకుంటావు?'' అని అడిగాడు జయపాలుడు.



"నన్ను సంతోష పెట్టండి, దొరా!" అన్నాడు మంగలి.

జయపాలుడు సరేనని వాడిచేత క్షౌరం చేయించుకుని ఒక రూపాయి ఇవ్వబోయాడు. మంగలి తీసుకోలేదు. అయిదు రూపాయలిచ్చినా వాడు నిరాకరించాడు. జయపాలుడికి ఆగ్రహం వచ్చి, "నీకు నే నేమీ ఇవ్వను. దిక్కున్న చోటుకు వెళ్లి చెప్పుకో!" అన్నాడు.

చేపలు పట్టేవాడూ, చెవి లేనివాడూ, ఆడదీ, మంగలీ—ఈ నలుగురూ రాజసభకువెళ్లి జయపాలుడి పైన ఫిర్యాదులు చేశారు. జయపాలుణ్ణి రాజసభకు పిలిపించారు. విచారణ ఆరంభమయింది. మొదట చేపలు పట్టేవాడు రాజుగారితో, "మహారాజా, చచ్చిపోయిన నా తండ్రి నీటికొంగగా పుట్టి నాకు చాలాకాలంగా చేపల వేటలో సహాయం చేస్తూంటే, ఈ మనిషి ఆ కొంగను కాస్తా చంపి నాకు తీరని నష్టం కలిగించాడు," అన్నాడు.

రాజుగారు జయపాలుడి కేసి తిరిగి, "ఈ చేపలు పట్టేవాడికి ఒక నౌక పరిహారం ఇయ్యి!" అన్నాడు.

తరువాత చెవిలేని వాడు ఫిర్యాదు చేశాడు. "మహారాజా, ఈ మనిషి తండ్రి దగ్గిర నా కుడిచెవి తాకట్టు పెట్టి పది రూపాయలు తీసుకున్నాను. ఆ బాకీ చెల్లు వేస్తాను, నా చెవి నాకు ఇప్పించమంటే, ఈ మనిషి నన్ను దిక్కున్నచోట చెప్పుకోమన్నాడు," అని వాడన్నాడు.

రాజుగారు తీర్పు చెబుతూ, జయపాలుడు చెవి లేనివాడికి ఒక నౌకను పరిహారంగా ఇవ్వమన్నాడు.

తరవాత స్త్రీ జయపాలుడిపైన ఫిర్యాదు చేసింది. ఆమెకు కూడా రాజుగారు జయపాలుడి నౌక ఒకటి ఇవ్వవలసిందిగా తీర్పు చెప్పాడు.

ఆఖరుకు మంగలి వచ్చి ఫిర్యాదు చేశాడు. "అయ్యా, ఈయన నా చేత క్షౌరం చేయించుకుని నన్ను సంతోష పెడతానన్నాడు. ఆయన నౌక ఒకటి



నా కిప్పిస్తే నేను సంతోషిస్తాను. అంత కంటె తక్కువ అయితే నేను సంతోషించను!'' అన్నాడు.

"మంగలి చెప్పేది సబబుగానే వున్నది. అందుచేత జయపాలుడు మంగలికి ఒక నౌకను ఇచ్చుకోవాలి!'' అని రాజుగారు తీర్పు చెప్పాడు.

జయపాలుడి మెడలో వున్న రత్నహారం తప్ప మిగిలిన అతని ఆస్తి యావత్తూ పోయింది. ''ఇప్పుడు ఏం చేయాలి? ఈ ఇక్కట్టులో నుంచి ఎలా బయటపడాలి?'' అని అతను ఆలోచిస్తూ ఉండగా రాజసభలోకి రాజుగారి కొడుకు పదేళ్ళ వాడు వచ్చాడు.

వెంటనే జయపాలుడు తన మెడలో వున్న రత్నహారం తీసి రాజకుమారుడి మెడలో వేశాడు. సభలో అందరూ చప్పట్లు కొట్టి హర్షధ్వానాలు చేశారు.

రాజుగారు కూడా తన కొడుకును దగ్గిరికి పిలిచి, అతని మెడలో వున్న రత్నహారం చూసి, ముచ్చటపడ్డాడు.

జయపాలుడు సభికుల కేసి తిరిగి, ''నేను రాజకుమారుడికి ఈ రత్నహారం ఇచ్చినందుకు ఈ సభలో సంతోషించని వారెవరైనా వున్నారా?'' అని అడిగాడు.

''లేరు, లేరు! సంతోషించాం!'' అని అందరూ కేకలు పెట్టారు.

జయపాలుడు మంగలి కేసి తిరిగి, ''ఏమోయ్, నీ మాటేమిటి? నువు కూడా సంతోషించావా?'' అని అడిగాడు.

మంగలికి సంతోషించా నని చెప్పక తప్పిందికాదు. జయపాలుడు రాజుగారితో, ''మహారాజా, మంగలిని సంతోషపెట్టాను. అందుచేత వాడికి నేను నౌక నివ్వనవసరం లేదనుకుంటాను!'' అన్నాడు.

''అవును!'' అన్నాడు రాజుగారు.

తరవాత జయపాలుడు స్త్రీకేసి తిరిగి, ''అమ్మా, నీ మనోవర్తి విషయమై ఒక సంగతి చెప్పాలి. ఆ మనోవర్తి నీకు ఇస్తాను, కాని ఒక్క చిక్కున్నది. మా దేశాచారం ప్రకారం భార్య భర్తతో సహ

గమనం చేయాలి. దురదృష్టవశాత్తూ మా తండ్రిగారు, ఏడాది క్రితం పోయారు. అందుచేత నువు చితి పేర్చుకుని చని పోయినట్లయితే, నీ వారసులకు పది వేలిస్తాను,'' అన్నాడు.

''నేను బలవంతాన ఒక్కనాటికీ చావను!'' అన్నది స్త్రీ.

జయపాలుడు రాజుతో, ''మహారాజా, నే నీమెకు పరిహారం చెల్లించనవసరం లేదనుకుంటాను,'' అన్నాడు. రాజు అందుకు సరేనన్నాడు.

తరవాత జయపాలుడు చెవిలేని వాడితో, ''బాబూ, నీ చెవి ఇప్పించటానికి కూడా నా కభ్యంతరం లేదు. మా తండ్రిగారి హయాంలో ఎన్నో వేలమంది తమ చెవులు తాకట్టు పెట్టి నీలాగే ఋణాలు పుచ్చు కున్నారు. వాటిలో నీ చెవి పోల్చటం సాధ్యం కాదు. అందుచేత నమూనా కింద నీ ఎడమచెవి కోసి ఇచ్చావంటే దానితో సరిపోల్చి నీ రెండు చెవులూ నీకు పంపు తాను,'' అన్నాడు.

ఇందుకు చెవి లేనివాడు ఒప్పలేదు. వాడికి పరిహారం ఇవ్వనవసరం లేదని రాజుగారు తీర్పు ఇచ్చాడు.

తరవాత జయపాలుడు రాజుగారితో ఇలా అన్నాడు: ''మహారాజా, నా తండ్రి గారుచనిపోయాక చేపగా పుట్టినాకు నౌకలు నడపటంలో సహాయపడుతూ వున్న సమ యంలో ఈ చేపలు పట్టేవాడి తండ్రి కొంగరూపంలో వచ్చి ఆయనను మింగే శాడు. అందుచేత నేనా కొంగను చంపాను. చేప రూపంలో వున్న మా తండ్రి అ విధంగా చనిపోకపోతే, నే నీనగరం చాయ లకు రావటమే జరిగేది కాదు!''

రాజుగారు ఈ మాట విని సంతోషించి, చేపలుపట్టే వాడికి కూడా పరిహారం ఇవ్వనవసరం లేదని తీర్పుచెప్పాడు.

తరవాత జయపాలుడు ఒక వారం రోజులపాటు రాజుగారి అతిథిగా వుండి, ఆయన వద్ద కొన్ని బహుమానాలు పొంది, తన నాలుగు నౌకలనూ తరలించుకుని తన దేశానికి వెళ్ళిపోయాడు.



# ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 50 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1983 జనవరి నెల సంచికలో ప్రకటింపబడును.



M, Natarajan



M. Natarajan

★ పై ఫొటోలకు సరియైన వ్యాఖ్యలు ఒక్క మాటలో గానీ, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.)

★ నవంబర్ నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరవాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింప బడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 50/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి:– చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు-26

---

## సెప్టెంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : చేతిలో బాకు

రెండవ ఫోటో : చెంతకు రాకు!

పంపినవారు : శ్రీమతి జి. శాంతికిరణ్, మారుతీనగర్, విజయవాడ-4

బహుమతి మొత్తం రు. 50/– నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.




పేరు :

వయసు :

చిరునామా :

పోటీలో పాల్గొనడానికి నిబంధనలు:

1. 7-12 సంవత్సరముల వయసుగల బాలలకు మాత్రం ఈ పోటీ ఉద్దేశింపబడినది.
2. పాల్గొనువారు పైన ఇచ్చిన పాస్‌బుక్ నమూనాకు రంగులు వేయడానికి నీటి రంగులు కానీ, కుంచెలుగానీ, రంగు పెన్సిళ్ళుగానీ వాడవచ్చు.
3. పాల్గొనువారు తమకిష్టమైనన్ని ఎంట్రీలు పంపొచ్చును.
4. పూర్తిచేసిన ఎంట్రీలను పైన ఇచ్చిన చిరునామాకు 15-12-1982 లోగా అందేటట్లు పంపాలి.
5. ఫలితాలు ముందు రాబోయే సంచికలో ప్రకటించబడుతాయి.
6. న్యాయ నిర్ణేతల నిర్ణయం తుది నిర్ణయంగా అన్ని విషయాలకు పరిగణించబడును.

బహుమతులు



**P.R. SECTION**
**CANARA BANK**
**HEAD OFFICE**
**112 J.C. ROAD**
**BANGALORE 560 002**



**కెనరా బ్యాంక్**
(జాతీయ బ్యాంక్)

**Results of Chandamama—Camlim Colouring Contest No. 25 (Telugu)**

*1st Prize:* P. U. Ram Gopal Sharma, Nagarthlet-561 101. *2nd Prize:* K. V. R. Chand, Kakinada-3. K. Rama Lingeswararao, Poranki-521 137. M. Prasad, Madras-17. *3rd Prize*: M. Mahesh Kumar, Secunderabad. G. V. S. Y. Ramana, Peddapuram. D. Srinivas, Hyderabad. M. Jalaja, Narasaraopet. M. D. Zakeer Hussain, Kalyani Khani. K. V. N. Sharmila, Masulipatam-2. M. Srinatha Reddy, Hyderabad. P V N K Anil Kumar, Zaladanik Kavali. C. H. Ramulu, Godor-506 134. W. Paul Ravi Kumar, Kurnool.




WALT DISNEY'S

# Jungle Book

## Crown Collection

### గోల్డ్‌స్పాట్ జంగిల్ బుక్ ఆల్బమ్
### ఉచితంగా
### పొందండి. గోల్డ్‌స్పాట్ ఫన్‌కిట్ గెలవండి.

ఇప్పుడు, నీలం క్రౌన్ మూత గల ప్రతి గోల్డ్‌స్పాట్ సీసా మూత లోపలి వేపు జంగిల్ బుక్ సినిమాలోని జంతువు యొక్క రంగుల చిత్రం వుంటుంది. మూత లోపలి ప్లాస్టిక్‌ను జాగ్రత్తగా తీసివేయండి. ప్లాస్టిక్ వెనుక వేపు చిత్రం ముద్రించబడి వుంటుంది.

6 చిత్రాలు సేకరించిన తర్వాత ప్రవేశ పత్రంపై అతికించి దానికి బదులుగా అందమైన జంగిల్ బుక్ ఆల్బమ్ పొందండి.

తర్వాత, ఆల్బమ్‌ను పూర్తిగా చిత్రాలతో నింపడానికై జంగిల్ బుక్ జంతు చిత్రాలను సేకరిస్తూ వుండండి. అసలు మజా ఇపుడే మరి వచ్చేది.

ఎందుకంటారా? మీరు మీ స్నేహితులతో పోటీ చేయవచ్చు. ఒకే లాంటివి రెండు మీ దగ్గర వుంటే వారికిచ్చి బదులుగా వేరేవి తీసుకోవచ్చు. మొత్తం 36 చిత్రాలతో ఆల్బమ్‌ను నింపారంటే ప్రత్యేకమైన గోల్డ్‌స్పాటర్ ఫన్‌కిట్ కూడా గెలవగలరు.

*ప్రవేశ పత్రాల కోసం వార్తా పత్రికలు చూడండి. లేక మీకు సమీపంలోని గోల్డ్‌స్పాట్ డీలర్ నుంచి పొందండి. (గమనిక: ఎంపిక చేయబడిన ప్రాంతాల్లో మాత్రమే ఈ అవకాశం వుంది)

ఆల్బమ్‌లు పరిమితంగా ముద్రించబడ్డాయి. స్టాకు ముగిసిపోక ముందే త్వరపడండి.

Fun means Goldspotting



# పాపిన్స్ తంత్ర

రాము, శ్యాము
చెబుతారొక కథ బలేగా
రారండోయ్ పిల్లల్లారా
వినండి మీరు శ్రద్ధగా






అనగనగా ఒక కుందేలు తెల్లారగానే లేచింది
ముఖం కడుక్కుంది చక్కా ముస్తాబైంది
అడుగుపెట్టింది బయట ఆహారం కోసం
ద్వారం దగ్గరే కన్పించింది దానికో మంచి దృశ్యం
ముల్లంగి దుంపలెన్నో ముంగిటి ముందే వున్నాయి
మహా తాజాగా వున్నాయి నోరు ఊరిస్తున్నాయి
ఏమి నా భాగ్యమని కుందేలు అనుకుంది
ఎంచక్కా తింటానని ఎగిరి గంతేసింది

ముందడుగు వేసింది ముల్లంగి కోసమని
కుప్పించి చూసింది వాటిని తిందామని
హఠాత్తుగా దాని మెడ ఉచ్చులో పడింది
దాగి వున్న నక్క నవ్వుతూ వచ్చింది
నక్క అంది కదా "ఓ వెర్రి కుందేలా,
నకిలీ ముల్లంగి కోసం నాకు చిక్కావు సుమా!"
అందుకే ఓ పిల్లల్లారా మీరూ వినండి శ్రద్ధగా
అందరూ ఎప్పుడూ ఉండాలి ఎంతో మెలకువగా
తినకండి సుమా నకిలీ పాపిన్స్ మీరు
కడుపు నొప్పితో అనక బాధపడతారు




నకిలీవాటి మోసంలో పడనే వద్దు
అలాంటివెప్పుడూ మనకొద్దే వద్దు
అందమైన వెండి చారలు ఉన్నాయేమో చూడండి
అసలైన పాపిన్స్ పాకెట్ అదే అని గ్రహించండి